# అభాగిని

## (బెంగాలీ కథలు)

అనువాదం:—

'శివం'



కవితా పబ్లికేషన్స్

విజయవాడ-2

ఇందులో!

కీర్తి శేషులైన శ్రీ యస్. జి. ఆచార్యగారి

దివ్య స్మృతికి.

# అ భా గి ని

తడిసి బట్టల నుండి నీరు కారిపోతూండగా భుజాన బిందెతో, దొడ్డితలుపును తోసుకొని కోడలు సుశీల లోప లకు రెండు అడుగులు వేయగానే గదిలోంచి అత్తగారి స్వరం వినవచ్చింది——

‘‘ దొడ్డి తలుపును బార్లా తెరచి రావద్దని రాణీగారికి రోజూ చెపుతూండాలి కావల్ను ! ”

ఈ అదలింపును విన్న కోడలు వక్క క్షణం అట్లాగే నిలబడిపోయింది. ఒక చేతిలో నీళ్ళబిందె, మరొక చేతిలో పాత్రసామగ్రి వుండగా తలుపును ఎట్లా వేయాలో యీ కోడలికి అర్థము కాలేదు. నీటిబిందెను నేలపై దింపబోయి, అత్తగారి ఆచారానికి యీ పని పనికిరానిదని వెంటనే గుర్తుకు రాగా, వెంటనే వెనక్కితిరిగి కాలితో దొడ్డి తలుపు నెట్ట ప్రయత్నించింది. దౌర్భాగ్యపు తలుపు వక్క అరంగుళ మయినా జరగకపోగా, సుశీల తన అసహాయతకు నవ్వు కుంటూ, ‘ లాభములేదత్తయ్యా ! ఇవన్నీ వంటింట్లో పెట్టేసి తలుపును వేస్తా వుండండి ’ అంది

“ ఏరోజున వేయకలిగేవు కనక ” అంటూ అత్తగారు గదిలోంచి బయటకు వచ్చింది. “ ఆ తలుపును వేయకలిగే వుంటే మిరపచెట్లన్నీ నాశన మెందుకవుతాయి ? ”

ఇంతటితో ఆగలేదు మోక్షదా. దుసరుస లాడు తూనే వెళ్ళి దొడ్డి తలుపును వేసివచ్చి యింకా అంది “ నిన్న

# అ భా గి ని

తడిసి బట్టల నుండి నీరు కారిపోతూండగా భుజాన బిందెతో, దొడ్డితలుపును తోసుకొని కోడలు సుశామ లోప లకు రెండు అడుగులు వేయగానే గదిలోంచి అత్తగారి స్వరం వినవచ్చింది—

,, దొడ్డి తలుపును బార్లా తెరచి రావద్దని రాణీగారికి రోజూ చెపుతూండాలి కావల్ను !"

ఈ అదలింపును విన్న కోడలు వక్క క్షణం అట్లాగే నిలబడిపోయింది. ఒక చేతిలో నీళ్ళబిందె, మరొక చేతిలో పాత్రసామగ్రి వుండగా తలుపును ఎట్లా వేయాలో యీ కోడలికి అర్థము కాలేదు. నీటిబిందెను నేలపై దింపబోయి, అత్తగారి ఆచారానికి యీ పని పనికిరానిదని వెంటనే గుర్తుకు రాగా, వెంటనే వెనక్కితిరిగి కాలితో దొడ్డి తలుపు నెట్ట ప్రయత్నించింది. దౌర్భాగ్యపు తలుపు వక్క అరంగుళ మయినా జరగకపోగా, సుశామ తన అసహాయతకు నవ్వు కుంటూ, 'లాభములేదత్తయ్యా! ఇవన్నీ వంటింట్లో పెట్టేసి తలుపును వేస్తావుండండి' అంది

" ఏరోజున వేయకలిగేవు కనక " అంటూ అత్తగారు గదిలోంచి బయటకు వచ్చింది. " ఆ తలుపును వేయకలిగే వుంటే మిరపచెట్లన్నీ నాశన మెందుకవుతాయి ? "

ఇంతటితో ఆగలేదు మోక్షదా. రుసరుస లాడు తూనే వెళ్లి దొడ్డి తలుపును వేసివచ్చి యింకా అంది " సిగ్గు

లేదే పిల్లా! ఏడవ లేక ఎట్లా నవ్వ కల్గుతున్నావంటా ! పడుచు పిల్లలట్లా నవ్వొచ్చా ?"

సుశామ శిరస్సు సిగ్గుతో క్రుంగిపోయింది. తనకీ అవస్థలో నవ్వెందుకు రావాలో భగవంతుడికే తెలియాలి. చీకటిగా ఉన్న గదిలో పాత్ర సామగ్రిని నేలపయిన పెడు తూండగా, బిందెలకు కాబోలు తగిలి చప్పుడయ్యింది.

"అంత పొగరుమోతుతనం చూపించవద్దు పిల్లా! నీ వయస్సు స్త్రీలకు పొగరు వుండటం అట్టే మంచిదికాదు" అందుకుంది అత్తగారు.

"ఎవరి పొగరుమోతుతనాన్ని గురించి మాట్లాడు తున్నావ్ మోక్షదా" అంటూనే నిస్తరిణి వర్షపు చినుకుల్లో తడుస్తూవచ్చి గుమ్మంలో నిలబడ్డది.

నిస్తరిణి అంటే ప్రక్కయింటి విధవావిడ. అంతా యీమెను 'తాపీ తల్లి' అంటూంటారు.

జరిగే హడావుడి దేన్నిగురించో 'తాపీ తల్లి' కి తెలుసు. సుశామ తనకు అగుపించక పోయినా, సుశామను సంబోధిస్తూ ఆమె చెప్పసాగింది. "పిల్లా! అత్తగారికి ఎదు రాడవచ్చునా? నీకు తల్లి తండ్రీకూడా అత్తగారే కదా! గీతలో ఏమన్నారో వినలే"—

"ఓ లక్షసార్లు ఎదిరిస్తుంది. దానికేం! కూర్చోండి... కూర్చోండి ... నిలబడే వున్నారు" అంది మోక్షదా.

సోదరి నిస్తరిణి వాకిట్లోనే కూర్చుని "అబ్బే ! కూర్చొ డంకూడానా? ఇంకా బోలెడు పని వుంది. ఈ వుత్తరం ముక్క చదివిద్దామని వచ్చా" అంటూ దుస్తులక్రిందనుంచి

వక కార్డును బయటకు తీసి "ఏదీ అమ్మాయి? ఇంతలోనే... ఎక్కడికి వెళ్ళింది" అని అడిగింది.

సుశామ ఎక్కడకూ వెళ్ళలేదు. ఆ చీకటి గదిలోనే కురుల నారబెట్టుకుంటూంది. నిస్తరణి మాటలు వినగానే— కొంగునుకూడా తలమీదకు లాగుకోనడం మరచి, ఖంగారుగా బయటకు వచ్చింది సుశామ, "ఏదండి వృత్తరం ?" అంటూను.

మోక్షదా చుర చుర చూస్తూ అంది "తనకే మహో అందమయిన కురులున్నాయని గర్వంతో ఎంత చచ్చి పోతూంది...... !"

కోడలు సుశామ బిక్క చచ్చిపోయి, వెంటనే నాలుకను కరచుకుంటూ నెత్తిపైకి ముసుగును లాక్కుంది.

'త్రాపీ తల్లి' దిద్దింది "అది కాదమ్మా విషయం ! మీా హారీశుడు ప్రేమిస్తున్నాడని...వూ...మిట్టిపడుతూంది."

హారీశుడి తల్లి యీా విషయాన్నేమాత్రం వప్పుకోలేదు. అందుకనే ముఖాన్ని చిట్లించి "పిచ్చిమాటలు మాట్లాడకు ! పెళ్ళయి ఆరేళ్ళయింది. ఇంతవరకూ పిల్లామే కాలేదు. ఎందుకూ...ఆ ప్రేమమీాద నిప్పులొయ్యనూ..." అంది.

"అది నిజమే ననుకో. పిల్లలువుంటే యింటికి ఎంత అందం !"

"నే నేం చేయను అక్కా ! ఇదంతా నా ప్రారబ్ధము ...అంతే !" అంటూ నెత్తికొట్టుకొన సాగింది మోక్షదా.

"కాళీదేవి తాయత్తు లేమయినా తెప్పించి కట్టక పోయేవ్ చెల్లీ."

"అన్నీ అయ్యేయి. చెయ్యాని దేమిటి? ముఖాన రాత వుండాలిగాని..."

తాపీ తల్లి వక్క క్షణంపాటు ఏదో ఆలోచించి వక సారి సుశామ ముఖను చూచి అంది "వయస్సుకూడా ఆట్టే లేదు! ఫర్వాలే. మా నారాయణికి యివన్నీ చేయవలసిన అగత్యం లేకపోయింది సుమా! దాని కిప్పుడు నల్గురు పిల్లలు. అది యిప్పు డేమంటూoదో విన్నావా? లేదమ్మా! పిల్లలు లేనివాళ్ళే నిజంగా సౌఖ్యవంతులు" అంటూంది. ఆపళంగా నేను నవ్వి అన్నా "ఆట్లాగా! పోయి వక్కసారి మోక్షదా కోడల్ని చూచిరా ... ఆమె తల ఎట్లా బాదుకుంటూందో పిల్లలకోసం" అని.

ఒక వైపు 'తాపీ తల్లి' మరోవైపు మోక్షదా, యిట్లా దాడి సాగిస్తూండగా యిద్దరి మధ్యా సుశామ సిగ్గుతో క్రుంగిపోయింది ... చేతిలోని కార్డు చేతిలోనే వ్రేలాడు తూండగా. ఉత్తరం చేతికి యివ్వగానే సుశామ వకసారి తనలో తనే చదువుకుంది. ఇక బిగ్గరగా చదువుదామని అనుకుంటూండగా వుత్తరంపై నున్న తేదీ ఆమె కండ్లబడింది. తేదీ మూడు నెలల క్రితంది!

ఆ దినాన హోరున వర్షం కురుస్తూంది. 'కురవనీ, అంటు పాత్రల్ని వుపయోగించి కులాన్ని పోగొట్టుకునేకంటె, తడిసి, కాస్త ఆరోగ్యాన్ని పాడుచేసుకోవడం చెడ్డపని

కాదుగా ' అని అనుకుంటూ మోక్షదా వుదయాన్నే చెరువుకు వెళ్లింది. చెరువు నుంచి యింటికి తిరిగి వస్తూండగా— ఆమె కండ్లు ఒక్కసారిగ, గుమ్మం ముందు నిలబడివున్న ' సుకు ' మీంద వాలేయి. కంసాలి ' సుఖదేవ్ ' వకచేత్తో చిన్న రేకు డబ్బా మరో చేత్తో గొడుగును పట్టుకుని గుమ్మంలో నిలబడి వున్నాడు.

" ఏం ' సుకూ ' ! ఎవరికోసం వచ్చేవు...వర్షంలో !

" కోడలిగారి కోసము "

" కోడలా ! కోడ లెందుకు ? "

" కొంచెం పనుండి వచ్చేలెండి, "

సుఖదేవుడిచ్చిన సమాధానం మోక్షదా కెంత మాత్రమూ నచ్చలేదు. కాగా ముందుకొచ్చి మరీ అడిగింది — "ఏమిటూ రాచకార్యం ? "

సుఖదేవుడు రహాస్యాన్ని అట్టే కాలం దాచలేక పోయేడు. వెంటనే చెప్పేసేడు " ఏముందమ్మా ! మురుగుల జత వొకటి తెచ్చే. "

" ఏమిటీ ? మురుగుల జతా ? " మోక్షదా ఆశ్చర్యానికి మేరలేదు.

" ఎవరి కీ మురుగులు ? "

" కోడలుగారు తయారుచెయ్యమన్నారు " అన్నాడు నీళ్ళునములుతూ.

మోక్షదా కొన్ని క్షణాలు మానాన్ని వహించి, అంది — " ఏవీ — చూడనీ. రా ! లోపలికి రా. "

'సుకు' మోక్షదాను అనుసరించేడు వరండాలోకి మోక్షదా వంటయింట్లోకి వెళ్లింది నీళ్ళబిందెను దించుకొడానికి.

సుశామకి యీ విషయ మేమీ తెలియదు. ఆ వు యాన ఆమె కొంచెం ఆలస్యంగా లేచింది. లేచీ లేవకుడానే, మేడమెట్లు దిగుతూ వరండాలో నిలబడివున్న 'సుకు' ను చూచి ఆశ్చర్యముతో ఆమె అంది "ఓయి భగవాన్! నిన్నిక్కడకు రమ్మని ఎవరన్నారు?"

ఇంకా అత్తగారు చెరువు వద్దనే వుందనే భ్రమతో సుశామ యీ మాటల్ని జారవిడిచింది. తను చెప్పదలచుకున్నది యింకా పూర్తి కాకుండానే అత్తగారు అర్థాంతరంగా ముందుకువచ్చి అంది "నేనే అతన్ని యిక్కడకు రమ్మన్నానే అమ్మాయి! ఒకవేళ నేను చేసినపని తప్పే అయితే ... క్షమించు"

సుశామ తెల్లబోయి మూగు మాటాడలేక తలను వంచుకొని కాలి బొటనవేలితో నేలపై చిత్రాలు గీయసాగింది.

"ఏవీ సుకు! కాస్త చూడనీయి...! ఎన్ని జతలు చేసేవ్ ... ఎంత బంగారం అయ్యింది!" అంది మోక్షదా 'సుకు' వైపు తిరిగి.

'సుకు' వెర్రివాడలా యికిలిస్తూ, నేలపై చతికిలపడి, రేకుడబ్బాలోంచి వుల్లికాగితంలో దాచి వుంచబడ్డ మురుగుల జతని బయటకు తీసేడు. జత అట్టే పెద్దదికాదు, బంగారం కూడా ఎంతో పట్టి వుండదు కూడాను.

సుశామవైపు చూస్తూ 'సుకు' చెప్పేడు "చూడండి, అచ్చంగా మీరు చెప్పినట్లు తయారుచేసే సోణామణి చేతులకు పూసినట్లు సరిపోతాయి."

సుశామ చేతులను చాచి మురుగుల జత నందుకొని, వంచిన తలతోనే అంది "ఇక వెళ్ళు." ప్రమాదాన్ని గ్రహించినవాడిలాగ, సుకుమారు మాటాడక తోక ముడిచాడు.

మోక్షదా కాలాన్ని వ్యర్థపరచకుండా వెంటనే ఎదుర్కొంది. "సోణామణి అంటే చపలకొండు కేనా ?"

సుశామ 'అవున'ని తలూపుతూ మేడమెట్లవైపు నడుస్తూండటం చూచి మోక్షదా మండిపడుతూ అరిచింది "ఆగు - కాస్త !"

మేడమెట్ల వరకు వెళ్లిన సుశామ యీ కేకను విని చట్టున నిలబడిపోయి వెనక్కి తిరిగి చూచింది.

మోక్షదా చేతులు తిప్పుకుంటూ చెప్పింది. "నేనీ మధ్య ధాన్యము కొనాలని, డబ్బును పంపుకుంటూ హరీశుడికి జాబు వ్రాసే. తన తగ్గర చాలాతక్కువగా డబ్బున్నదని వాడు జవాబు యిచ్చేడు. ఔను - వెర్రిబాగులదాన్ని, నిజమే ననుకున్నా. మొన్న వాడే యిక్కడకు వచ్చినప్పుడు బజారుకుపోయి, రెండుపీసెల బంగాళా దుంపలు తెచ్చి యింట్లో పడెయ్యరా - తిని చాలా దినాలయ్యింది, అన్నా. 'చిల్లిగవ్వకూడా నావద్ద లేదే' అన్నాడు. అయితే యివన్నీ వాడంతట వాడన్నమాటలేనా, నీవు నేర్పి పెట్టినావా ?"

ఇటువంటి ప్రశ్నలకు జవాబు లివ్వట మెంతకష్టమో యీనాటి కోడళ్ళకు బాగా తెలిసే వుండొచ్చు. అందుచేత సుశీల మారుమాటాడక వూరుకుంది.

మోక్షదా స్వరాన్ని మార్చి, తేనెలూరేట్లుగ "ఇక నేను చెప్పేదేముంది పిల్లా! మొగుళ్లు డబ్బులేక నానా బాధలూ పడుతూంటే, భార్య యిట్లా దానధర్మాలు చేస్తే సంసారా లెట్లా సాగుతాయో నువ్వే ఆలోచించు."

సుశీల నిశ్శబ్దంగా వూరుకోలేక, కొంచెం కోపము తోటే జవాబిచ్చింది "మీ అబ్బాయి ... నాకేమీ దాన ధర్మాలకి డబ్బివ్వలే. నా డబ్బును ధర్మంచేస్తున్నా. నా దగ్గర స్వంత బంగారముంటే దాంతో చేయించే యీ ముడుగుల్ని"—

"అదిమాత్రం ఎందు కివ్వాలంటా? నువ్వు చెప్పింది గొప్పగా వుందనుకుంటున్నా వేమో! ఎవరన్నా వింటే నవ్వి పోతారు. నా మేనల్లుడి అన్నప్రాసనకు నువ్వూ యిక్కడే వున్నావ్. అయినా నేనేమీ వాడి చేతిలో పెట్టలేకపోయే. వాడు నీకెందుకులే. పొరుగింటి స్నేహాలూ అవ్వీ బాగానే వున్నాయ్ ... కాని యీ దాన ధర్మా లేమిటే అంటా... నా కివ్వన్నీ నచ్చవమ్మా!! నేను బ్రతికుండగానే నా కళ్ళె దుట యిట్లాంటివి జరుగుతూండగానే చూస్తూ కూచోలేను. నేను కాస్తా 'హరీ' అన్నాక ... ఓ నీ యిష్టం. రెండు చేతులతో కొంపంతా దోచి పెట్టినా నిన్నసే వారుండరు. నీ యిష్టమొచ్చింది ... నీ యిష్టమొచ్చినవాళ్ళ కిచ్చుకో ... నాకేం?"

సలహా అంత చెడుగాలేదు. చివరంటా శాంతంగా విని సుశామ అంది "అట్లానే అత్తా! నా యిష్టమొచ్చింది యిస్తా ... మురుగులే కాదు."

గృహానికి రాణీవంటి వ్యక్తి - మోక్షదాకు వెంకి సమాధానమా? కోపముతో మోక్షదా వణకిపోయింది. కండ్లనుండి నిప్పులను రాలుస్తూ "ఇష్టమొచ్చినది యిస్తావ్ కాదూ. ఇయ్యి, అట్లాగే ఇయ్యి. ఇచ్చేవంటేమాత్రం ఆ పిల్లాడ్ని కాల్చుకు తిన్నంత వొట్టని మాత్రం మర్చిపోకు."

ఇంత పెద్ద ఒట్టును పెట్టేక, కొంచెము హృదయం తేలికవ్వగా, మోక్షదా తలుపులనూ, చెంబులనూ తన్నుకుంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

నిత్యమూ మిత్రులిద్దరూ స్నానాల రేవువద్ద కలుసుకోవడం అలవాటు. నీళ్ళకోసం సుశామ, బట్టలుతుక్కోడానికి చపల వస్తూంటూరు. ఈనాటి సాయంత్రము సుశామ తలనయినా దువ్వకోకుండానే, జుట్టును వదులుగా ముడుచుకొని చెరువునకు బయలుదేరినది. పొలముగట్లను దాటుతూండగా, వేపచెట్టు నీడను నిలబడివున్న చపల అగుపించింది సుశామకు. సుశామే అడిగింది "సోనా ఏడీ?"

"ఇవ్వేళే మా వొదిన తీసుకెళ్లింది."

సుశామ వక్క క్షణం వూరుకొని తిరిగి అడిగింది "ప్రొద్దున్న కూడా పంపలేదేమే అబ్బాయిని?"

"ఖేందీ తీసుకొని వెళ్ళనంది చెల్లీ! వర్షం కురుస్తూంది—నే వెళ్ళనుగాక వెళ్ళనంది అది."

సుశామ మారు మాటాడక వూరుకుంది.

చపల వుండబట్టలేనట్లు అడిగింది "అయితే కలకత్తా వెళ్ళడం ఎప్పుడేమిటి ?"

ఈ మాట వినగానే సుశామకు ఆకాశంమీదనుంచి ఒక్కసారిగా జారిపడ్డ ట్లనిపించింది. కలకత్తాలో యిల్లు అద్దెకు తీసుకుంటానని — తన భర్త నిజానికి అనేకసార్లు అంటూ వచ్చేరు. కాని తనీ విషయాన్ని పిట్టకయినా తెలియనీయని దే యీ చపల కెట్లా తెలిసింది !

సుశామ ఆశ్చర్యముతో "అక్కా ! నిజంచెప్పు. ఎక్కడ విన్నావీ సంగతి?"

చపల ముఖాన్ని చిత్రంగా పెడుతూ చెప్పింది "ఇంకా ఎక్కడనుంచి వింటాను ? మీ అత్తవద్దనుంచే."

"మా అత్తవద్దనుండా ?"

"అవునే — మీ అత్త వద్దనుంచే. నేను యింటికి వస్తూండగా మీ అత్త తాపీ తల్లితో నిలబడి మాట్లాడు తూంది. నీపేరును వినగానే అక్కడే నిలబడిపోయే—ఏమిటా అని. కాని వాళ్ళు మాట్లాడుకునేది వినడానికి ఎవరి శక్యం? వాళ్ళిద్దరికీ దేముడు నాలుగేసి కండ్లనిచ్చేడు కాబోలు ! వాళ్ళు నన్ను ఎట్లా చూసేనో ఏమో. నన్ను చూడంగానే నిశ్శబ్దంగా వూరుకున్నారు. మీ ఆయనేదో ఉత్తరం రాసి నట్లూ, అందులో — 'నిన్ను కలకత్తా తీసుకుపోతా నన్నట్లు' వాళ్ళనుకుంటూన్నారు. నిజమేనా—చెప్పవూ?"

సుశామ ముఖం పాలిపోయింది ఏదో ఆలోచించు కుంటూ అట్లాగే కొంతసేపు నిలబడిపోయి, తర్వాత అన్నది. "లే, నీళ్ళు నింపుకుని పోదాం."

ఇతర దినాల్లో అయితే, వీరిద్దరూ తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, యీ తాలాడుతో త్వరగా తెమిలే వారు కాదు చెరువువద్దనుంచి. ఈనాడు సుశామ అన్యమనస్క అయి, వెంటనే బయలుదేరింది యింటికి. చపల తనలో తనే "నీ మనస్సింత కలవరపడేదని తెలిస్తే అసలీ విషయాన్నే చెప్పేదాన్ని కాదుగదా" అనుకుంటూ సుశామ ననుసరించింది.

అసలు చపల తనింకా చెప్పవలసిన విషయాన్ని చెప్పనేలేదు. అందుచేతనే సుశామను అనుసరిస్తూ...మెరక ఎక్కుతూండగా అంది "పోనిద్దూ! నల్గురూ నాల్గు రకాలుగా మాటాడుకుంటారు. యీ కాస్తదానికి మనస్సు పాడుచేసుకోవాలా..."

సుశామ మారు మాటాడక నడుస్తూంది. చపల తను చెప్పవలసిన విషయాన్ని ఎప్పటికప్పుడే చెబుదామనుకుంటూనే చెప్పలేకుండా వుంది. సుశామే ఆ విషయాన్ని గురించి ప్రస్తావిస్తుందని చపల అనుకొని వుండొచ్చు. కాని ప్రస్తుత పరిస్థితుల్లో ఏ విషయాన్ని గురించి కూడా మాట్లాడేట్లులేదు. చివరకు...చపల వకసారి పెదిమల్ని తడుపుకొని, అడిగినది "ఇవ్వేళ కంసాలి అగుపించలే ?"

జబాబే మియ్యాలో సుశామకు తోచలే. అప్రయత్నంగా తలనూపుతూ "లేదని" అంది సుశామ.

ఇది విన్న చపల బిగ్గరగా నవ్వేస్తూ "అః! అట్లాగా. ఎందుకే హాస్యాలాడతావు. ముహుగుల జిత యిచ్చేసినట్లు 'సుకు' చెప్పేడులే" అంది.

ఈసారి సుశామ నిజంగానే చిక్కులోపడింది. కొంచెం ఆలోచించి సుశామ అంది "నిజమే. 'సుకు' గాజుల్ని ఇచ్చేసేను. కాని నన్ను క్షమించు అక్కా — వాటిని నీకివ్వలేను."

చపల తన చెవులను తనే నమ్మలేకపోగా అంది "ఏం? అందముగా లేవేమిటి? ఫర్వాలేదు. నే నేమీ అనుకోనులే. వాటినేయివ్వు. అందానికి అంతేమిటి ?"

"కాదు కాదు. అదికాదు. మేము మురుగులజతల్ని బహూకరించేంత ధనవంతులమా—నువ్వేచెప్పు క్షమించు! నేనివ్వలేను వాటిని." చెప్పలేక చెప్పింది సుశామ-అబద్ధాన్ని.

ఈసారి నమ్మకుండా వుండడానికి చపలకేమీ మిగలలేదు. అందుచేత ఆమె ఓదీర్ఘ నిట్టూర్పును వదలి అన్నది "కాని ఎందుకూ? ఏంజరిగినది......చెప్పవూ...?"

సుశామ మాటాడక నడవసాగింది.

చపల నాల్గు నిమిషాలు మౌనంగా నడచి...గుమ్మన్నెక్కుతూ "ఇవతలవాళ్ళకు ఆశలు చూపి...హాత్తాసుల్ని చేయడం...మంచిదికాదు" గట్టిగాఅంది.

సుశామ కండ్లు నీటితో నిండాయి. అయినా సుశామ జబాబివ్వలేదు.

కోడలు గుమ్మమెక్కుతుండగానే మోక్షదా ప్రారంభించింది, "వెలుతురుండగా వెళ్ళి...యిప్పుడా రావడం కొంపకు! రోజూ కబుర్లు చెప్పుకోడానికి ఏముంటాయో... ఏమోనమ్మా—"

సుశామ యీ ధోరణిని లక్ష్యపెట్టక దొడ్డిలోనికివెళ్ళి తడిచీరను ఆరవేసుకుంటూ అడిగింది "ఎక్కడ వుందత్తా—ఆ వుత్తరం ? ఇట్లా యివ్వండి."

మోక్షదా యీమాటలేమీ విననట్లు అక్కడనుంచి వెళ్ళిపోబోతూండగా, తిరిగి కోడలు అడిగింది "ఉత్తరం యియ్యరూ?"

"ఉత్తరమా?" అత్తగారు ఆశ్చర్యాన్ని అభినయిస్తూ అడిగింది. "ఏం వుత్తరం ? ఎవరిది? ఎక్కడిది?"

సుశామ క్రోధంతో అనబోయింది "ఎంతసంగనాచివే" —కాని వెంటనే క్రోధాన్ని అణచుకొని అన్నది "మీరా వుత్తరాన్ని చదివి తేచదివేరు, ఫర్వాలేదు — యిప్పుడన్నా యివ్వండి."

"ఓయిదేముడా! ఏమంటోంది ఇది" అంటూమోక్షదా తలమీద చేతులుపెట్టుకొని అక్కడే కూర్చుండబోయి, ఏదో గుర్తుకురాగా నిలబడి అంది, "ఆగు! 'తాపీతల్లి'ని పిలుస్తాను. ఆఖరికి నాముఖాన యీ రాతకూడా రాసిపెట్టివుందా? ఇవ్వేళ తన వుత్తరాన్నిచించి చదివేను అంది. రేపు తన నగల్ని దొంగిలించేను అంటుంది. ఎవరు చెప్పగలరు ? ఒద్దు కోడలా —వద్దు. నా కీ విధమయిన సుఖం అక్కరలేదు. హరీశుడు రానీ ! వచ్చి తన పెళ్ళాన్ని తను తీసుకుపోనీయి. సుఖంగా అక్కడే వుండమను. లేకపోతే నేను ఏనుయ్యో, గొయ్యో చూసుకుంటా" మోక్షదా బయటకు వెళ్ళిపోయింది.

వంటకు వేళయినా సుశామ పొయ్యి వెల్గించనూలేదు, వేరే వంటప్రయత్నాలనూ చేయలేదు. లాంతరును తులసి

కోటవద్దనే వదలివేసి, వ్యాకులిత హృదయంతో అటూ ఇటూ నడయాడుతూ యీ విషయాన్ని చివరంట కనుగొన నిశ్చయం చేసుకోసాగింది.

ఇంతలోనే పదేళ్ళ కుర్రాడొకడు పరుగెత్తుకుంటూ వచ్చి లాగుజేబులోంచి వక కవరును తీసి సుశామ చేతిలో పెట్టి "ఇదిగో వుత్తరం" అని పరుగెత్తబోయేడు. సుశామకు మొదట్లో యిదేమీ అర్థమవ్వలే. కాని కవరుమీద 'అడ్రెస్సు'ను చూడగానే సంగతంతా ఆమెకు తెల్సిపోయింది. ఆ వుత్తరం తన భర్త వ్రాసినది.

సుశామ కుర్రవాడి చేతిని పట్టుకొని వాడిని పారిపోనియ్యక అడిగింది "ఎవరిచ్చేరు బాబూ నీకీ వుత్తరం ?"

కుర్రాడు కొంచెం కంగారుపడ్డాడు. భయపడుతూనే 'జమాను' అన్నాడు. సుశామ కుర్రవాడిని లాలిస్తూ "అబద్ధాలు చెప్పకూడదు బాబీ! సిగ్గు సిగ్గు. చదువుకొనే పిల్లలు అబద్ధమాడొచ్చా ? ఎవరిచ్చేరో నాకు తెల్సులే—"

కుర్రాడు సిగ్గుతో తలవంచుకొని "ఎవ్వరితో చెప్పనని వట్టువేస్తే చెబుతా ... వట్టువెయ్యి."

సుశామ వట్టువేసేక కుర్రాడు చెప్పేడు "తాపీ తల్లీ ఇంట్లోవున్నారు." చేతిని వదిలించుకొని కుర్రాడు పారిపోయేడు.

సుశామ కవరును తడిమి చూచింది. కవరు అతికించిన మైదా యింకా తడిగానే వుంది. ఉత్తరాన్ని విప్పి చదువుకున్నది. సిగ్గు సిగ్గు ! తనుతప్ప మరెవ్వర్నూ చదువకూడని సంగతుల్ని తన భర్త వ్రాసేడు ! ఆలోచించినకొద్దీ ఆమెలో

అత్తగారిపైన, ద్వేషం, యీర్ష్య ముప్పిరిగొనసాగేయి. ఉత్తరము ఆఖరులో హరీసుడిట్లా వ్రాసేడు "ఈసారి నేను నిజంగా చెబుతున్నా. ఇక్కడొక చక్కని యిల్లు అద్దెకు దొరికింది. శనివారం రాత్రి బండికి అక్కడకు వచ్చి, ఆదివారం నాతో నిన్ను తీసుకొనివెడతా. సిద్ధముగా వుండు."

ఇవ్వేళ శుక్రవారం, రేపు శనివారం, ఎల్లుండి యిక్కడనుంచి ప్రయాణం! ఈ ఆలోచనతో సుశామ ఆనందం పట్టలేకపోయింది. కొత్త యిల్లు, కొత్త వూరు... కొత్త కాపరం. అత్తగారి పోరు వుండదిక.

ఎంచక్కా భర్తతో ఆకబుర్లూ యీ కబుర్లూ మనసార చెప్పుకోవచ్చు. ఇద్దరూ కష్టసుఖాల్ని పంచుకోవచ్చు. ఇట్లా ఆలోచించుకుంటూనే సుశామ నాల్గు అటుకుల్ని తిని ఆపూటకు - వంటయినా చేసుకోక పడుకుంది...సుఖస్వప్నాలను కంటూ.

రాత్రి చేసిన వుపవాసానికి సుశామ పూర్తిగా అలసిపోయింది. అవ్వేళ ఏకాదశి అవడంవల్ల అత్తగారు యేమీ తినదు. ఇక తన వరకైతేనూ - కాస్త పొయ్యిమీద ఎసరేసుకుంటే చాలు. లేచి పక్కబట్టల్ని చుట్టేసి సుశామ క్రిందికి దిగివచ్చేసరికి పశువులశాల శుభ్రపరచబడి వుంది. ఆవు దూడల్ని వదిలి, అత్త చెరువుకు స్నానానికి వెళ్ళింది కావల్ను. త్వరత్వరగా వంట కానిచ్చేసి ... సామానులన్నీ సర్దుకుని ప్రయాణానికి తను ప్రయత్నాలు చేసుకోవాలని సుశామ అనుకుంది. పొయ్యిరాజేసి చెరువుకు వెళ్ళి బట్టలు వుతుక్కొని స్నానం ముగించి, నీళ్ళబిందెతో యింటికి జేరే

సరికి యింట్లో మీటింగు జరుగుతూండడాన్ని సుశామ గమ నించింది. మోక్షదా పొడి బట్టలతో తావళాన్ని త్రిప్పుతూ కూర్చునివుంది. చుట్టూ తాపీ, 'తాపీ తల్లి', లక్ష్మీపురి, ఇంకో విధవరాలు కూర్చునివున్నారు. అడుగులచప్పుడును విన్న నూతన విధవరాలు వెనక్కి తిరిగి సుశామ వైపొకసారి చూచి మళ్ళీ అటుతిరిగి అన్నది. "ఇప్పుడయితేనేం - సంతానం కలగొచ్చు. మీరు మా పిన్నిని చూడలేదు కాబోలు — చూస్తే మీకే తెలుస్తుంది. ఆమెకు ముప్పై అయిదేళ్లు...అయితే నేం..."

'తాపీతల్లి' తలనూపి, పెదిమలను విరిచి "లేదేపిల్లా! కాళీ మహాతల్లి తాయెత్తే పనిచేయకపోతే" మోక్షదావైపు తిరిగి..."ఏమంటావ్ సోదరీ?" అంది.

సోదరి మోక్షదా ఏమీ అనక వూరుకుంది. అనలేక పోవడానికి కారణం పరిసర ప్రాంతాల్లో కోడలుండటమేనని కూడా చూపులతోనే తన అసమర్థతను వ్యక్తపరచింది... కోడలివైపు తల నెగురవేసి.

నడుస్తూనే సుశామ యీ సంభాషణనంతా విన్నది. ఎంతసేపటినుంచో వాళ్ళమధ్య చర్చించబడుతున్న విషయము తననిగురించేనని కూడా గ్రహించింది. కాని మాటాడక తిన్నగా వంట యింట్లోకే వెళ్ళిపోయింది సుశామ. ఎట్లాగో వకవిధాన యింకా వక్క దినాన్ని గడుపగల్గితే ... తనకు శుభదినాలు వస్తాయ్. ఇంకా వక్కదినం — ఇరవై నాల్గు గంటలు!

వంట పూర్తి కాలేదు. అవతలవైపు మాత్రం మీాటింగు మాంచి హుషారుగా జరుగుతోంది. ఇంతలోనే ఖేందీ చంకను సోనామణిని వేసుకుని హాజరయ్యింది. సుశామ మాత్రం యీా విషయాన్ని గమనించనేలేదు. కాని ... ఆకస్మికంగా తనవీపుకు జేర్లబడి..."పాపా ! మా ... మా" అంటూాన్న సోనామణి మాటల్ని విని వెనుదిరిగి చూాచింది. ఖేందీ ఏమీా ఎరుగనట్లు ఎడంగా నిలబడివుంది. సుశామ తనవైపు తిర గడం చూాచిన సోనామణి, ఆమెను గట్టిగా కౌగలించుకొని బుగ్గను బుగ్గతో రాచి ... చిలిపిగా నవ్వసాగాడు సుశామలో "కలకత్తా వెళ్ళిపోతే తిరిగి ఎప్పుడు చూాస్తానో సోనాను" అనేతలంపురాగా, వంటమానేసి కాస్సేపు ఆడు కుంటూా కూాచ్చుందామూా అనిపించింది. కాని ఆవూాహను అణచుకొని...తిర్గి సోనావైపు చూాచేసరికి సోనా...తనను వెనక్కిలాగుతూా పొరలు పొరలుగా నవ్వుతూాన్నాడు. 'తన చేతులతో స్వయంగా సోనా బోసిచేతులికి మురుగుల్ని అలంకరిస్తే ఎంతబాగుండును ! కాని అత్తవద్దనుంచి వచ్చిన అంతపెద్దవట్టును తనువిని కూాడా మురుగుల్ని ఎట్లాయియ్య డం? సుశామకి, తనపై తనకే కోపంవచ్చింది. భగవంతుడీ నిరర్థకపు జీవితాన్ని తనకెందుకియ్యాలో ? నిట్టూార్పుతో సుశామ సోనానుండి చూాపుల్ని మరలించుకొని తిరిగి వంట వైపుతిరిగింది.

నాల్గు నిమిషాలైనా కూాడా సోనా కదలలే—వంట యింట్లోంచి. ఖేందీమాాట్లాడక నిలబడిచూాస్తోంది. సుశామ

తెచ్చి పెట్టుకున్న కోపంతో అంది "ఒసేయి ఖేందీ ! పిల్లాడిని తీసుకోక అట్లా చూస్తావేం !"

ఖేందీ నవ్వుతూ "వాడు నాదగ్గరకు రాడమ్మా. నీదగ్గరనుంచి ముఋగులు పెట్టించుకోందే నావద్ద కెట్లా వస్తాడూ ?" అంది. ఖేందీ గట్టిగా అన్న దీమాటల్ని వెంటనే మీాటింగు పైపునుంచి తాపీతల్లి అనడం వినవచ్చింది "వినవే ఆ పిల్ల మాటల్ని ? మురుగులు పెట్టించుకోడానికి వచ్చేడుట. ఏం మురుగులు ? మురుగులు అంత చవగ్గా వున్నాయా ?"

లక్ష్మీపురి కాబోలు అన్నది సాగదీస్తూ "ఆ...ఆ... బంగారపు మురుగులా ?"

మురుగుల విషయం వారిలో శుభ్రంగా యిదివరకే చర్చించబడ్డవిషయమని ఎవరయినా గ్రహించొచ్చు. ఈసారి సుశామకు నిజంగానే కోపంవచ్చింది. క్రోధముతో...తన మెడను చుట్టుకున్న సోనామణి చేతుల్ని వదిలించుకొని... వాడిని దూరంగా తోసింది. పెదవులు క్రోధముతో వణకుతూండగా యేదో అన్నది. కాని మాటలు బయటికిరాలే.

సుశామ విచిత్రప్రవర్తనకు హడలిపోయిన కుర్రాడు మతిపోయిన వాడిలా బిక్కముఖంతో సుశామ వైపే చూడసాగేడు.

సుశామ ప్రక్కకుతిరిగి కండ్లను తుడుచుకొని అంది- పెనాన్ని తీసేస్తూ "ఖేందీ - నిజంగా చెబుతున్నా, సోనాను యిక్కడనుంచి తీసుకుపో, లేకపోతే..."

ఖేందీ క్రోధంతో కుర్రాడిని బరాబరా యీడ్చి, నడుంకెత్తుకుని బయటకు నడిచింది. కుర్రాడు ఏడుస్తూ మారాంచేస్తున్నాడు. సుశామ కదలకుండా కుర్రాడివైపే చూడసాగింది — అట్లాగే.

వెనకోసారి సోనాకి కోపమొచ్చి ఖేందీని ముక్కు పట్టుకు కొరకిన విషయం సుశామకు గుర్తుకొచ్చి, యీవ్వేళ కూడా అట్లాంటిది జరగదుకదా అనే ఆదుర్దా అధికమవ్వగా, సుశామ మేడమెట్లు నెక్కింది. సోనా యింటికి పోయేరోడ్డు మేడకిటికీలోంచి పూర్తిగా కన్పిస్తుంది. కుర్రాడు ఎంతసేపని మారాముచేస్తాడు? బహుశా వాడప్పుడే సుశామను మరచిపోయి వుండొచ్చు. ఖేందీ యేదో చూపుతూ, ఏమేమో చెబుతూండగా సోనా నవ్వుతున్నాడుకూడాను.

సుశామ స్థిమితపడ్డ మనస్సుతో క్రిందికి దిగి వచ్చేసింది. సుశామను చూడగానే తాపీతల్లి అన్నది "ఇచ్చేదానివి ఎట్లానూ యిచ్చేవు; ఆ యిచ్చేదేదో మా కండ్లయెదుటనే యివ్వకూడదమ్మా — మహారాణీలా! ఇందులో రహస్యమేముందనీ..."

ఈ మాటలు విన్నప్పటికీ సుశామకు అర్థంకాలే — దేన్ని గురించో! తనను కాదనుకుని ... తిన్నగా వంటింటి వైపే నడుస్తూంది సుశామ వంచిన తలతో.

'తాపీతల్లి' వూరుకోలే. తిరిగి గట్టిగా అంది. "నిన్నే నమ్మా!"

ఇప్పటికీ సుశామ గ్రహించలే తననే పిలుస్తున్నట్లు. వంట యింట్లోకి వెళ్లిపోయింది ... అన్యమనస్కలా!

ఏకాదశీ వుపవాస మహాత్మ్యంవల్ల: నీరసించి, ప్రాణను శోషిల్లి పరున్న నూతన వితంతువు వులిక్కిపడి కూర్చుని అంది "నువ్వు చేసేపని యేంబాగుందే! ఆమె అసలు యిచ్చిందో లేదోకూడా నీవామెను పట్టుకొని అడగటం... ఛ! ఛ! తాపీ చెప్పిన సంగతులు... నమ్మేవీలున్నాయీ..."

మోక్షదా కనుగిల్పుతూ తలవూపి, జాగ్రత్తగా నలుమూలలా చూస్తూ చెప్పింది "ఇక్కడనుండి ఖేందీ పిల్లాడిని తీసుకెళ్ళిపోవడం మనమంతా చూడనే చూసేము. ఖేందీ బయటకు వెళ్ళి కిటికీకింద నిలబడివుండొచ్చు ... ఆమె కిటికీ లోంచి వాటిని జారవిడవడం కష్టమా...?"

ఇదంతా మహోవుత్సాహముతో వింటూన్న లక్ష్మీప్రియ "నిజమే. మీరు చెప్పిందికూడా సబబే. బంగారపు మురుగులు చేదా? చేతికి అందగానే వాటిని బొడ్డునపెట్టుకుని పరుగెత్తి వుంటుంది. అంతేగా!" అంది.

తాపీ—సన్నటి నక్కినరంలాంటి పిల్ల, పదకొండేళ్ళుంటాయి. వయస్సుకు చిన్నదయినా మాటల్లో యెవ్వరికీ తీసిపోదు. తాపీ అభినయపూర్వకంగా చెబుతూంది – "నిజమే నే నేనెందుకు అబద్ధం చెప్పాలి? ఖేందీ మురుగులను తీసుకుపోవడంమాత్రం నేను చూడలేదుగాని, సుశామక్కయ్య వాటిని కిందికి వదిలేయడం చూసేను. కిందపడేప్పుడెట్లా మెరిసేయనుకున్నావ్ అవి?"

"నాకూతు రెన్నడూ అబద్ధమాడి ఎరుగునా? ఎప్పుడన్నా దానినోట్లోంచి అబద్ధంవస్తే నాలిక రెండుగా చీల్చేయనూ?" అంటూ 'తాపీతల్లి' వంటింటివైపు తిరిగి "ఓ

సుశామా! రాణీగారి కూతురా! కొంచెం యిటొచ్చి నా మాట విని పో...ఒకసారి" అన్నది.

సుశామ వంటయింట్లోంచి యీ కేకను వినగానే బయటికి వచ్చి అమాయకంగా అడిగింది—"పిలిచేరా పిన్నీ?"

"అవునమ్మా! ఇందాకటీనుంచే పిలుస్తూనే వున్నా. ఇక మామాట ఎందుకు వింటావ్? నీవు ముఱుగుల జతను ధర్మము చేసేవని విన్నప్పటినుంచీ నా నరాలు బాధతో పీక్కుపోతున్నాయి. అందుకనే పిల్చే—నే చెప్పేది కాస్త విను..."

సుశామ తలమీాదకు కొంగును లాగికొని ముందు కొచ్చి వినయంగా నిలబడి "ఏమిటంటున్నారు మీారు?" అన్నది.

'తాపీతల్లి' చెప్పింది "సిస్సంతుల యిళ్ళల్లో యిట్లాంటివి అనేకం జర్గడం నాకు బాగా తెలుసు. కాని నేనెక్కడా బంగారపు ముఱుగుల్ని యివ్వడం ఎరగను. ఏది ఎట్లావున్నా-రహస్యంగా నువ్వు కిటికీలోంచి వాటిని ఖేందీకి జారవిడవడం ఏమీా బాగుండలే. మా అందరిముందు నిర్భయంగా మహారాణీలా యిచ్చివుంటే మేంకూడా చూచి ఆనందించేవాళ్ళముగా!"

సుశామ స్తబ్ధులా నిలబడిపోయింది!

హరీశుడు శనివారం రాత్రే వచ్చేసేడు. అతను ఆరోగ్యంతో చక్కగా వున్నాడు. స్టేషన్నుంచి నడచివచ్చి

నందువల్ల పుట్టిన ఆకలికి... వెంటనే భోజనానికి కూర్చున్నాడు.

భోజనంచేస్తూ తల్లితో అన్నాడు. "అమ్మా! కలకత్తాలో యిల్లొకటి అద్దెకు దొరికిందే!"

"మంచిపనే. నాయనా."

తన భార్యని కలకత్తా తీసుకుపోయి, అక్కడ కాపురం పెడతానని సూటిగాచెప్పడానికి సిగ్గుపడుతూ హరీశు డన్నాడు "హోటలు భోజనాలతో ఆరోగ్యమంతా నాశనయిపోతుందే అమ్మా!"

"నిజమేరా! హాయిగా నీభార్యని కలకత్తా ఎందుకు తీసుకుపోకూడదూ?

తల్లి నోటినుంచి, యింతత్వరగా యీధోరణిలో సంభాషణ వస్తుందని హరీసుడెన్నడూ అనుకోలేదు. బహుశా ఆమెకు కోపం వచ్చినదేమో అనుకొని అన్నాడతను "కోపం వచ్చిందా అమ్మా?"

"నాకా కోపం! లేదు—నాన్నా లేదు. ఇందులో కోపం రావడానికి ఏముంది గనుక? మాలాంటి వాళ్ళకు కోప తాపాలు వుండకూడదు. మొన్న మటుకు మొన్న మీాఆవిడ నన్ను నలుగురిలోనూ పట్టుకొని నానా మాటలు అని అవ మానపర్చింది. నీవు దానికి రాసిన వుత్తరాన్ని నేను తెరచి చదివేనని దొంగతనం కట్టింది. ఇంకా ఏమేమోఅంది. అదే మన్నా మాట్లాడక వూరుకున్నా. కోపం తెచ్చుకుంటే లాభ మేముంది? హరీశుడు రానీ వాడితోనే యీసంగతి చెబుతా

నను కొని వూరుకున్నా. పోనీలే, దానితో మళ్ళీయీసంగ తేమీ అనవద్దు. ఊరుకో నాయనా—ఎవరిపాపం వాళ్ళది."

భార్యకోసం హరీశుడు నాల్గువైపులాచూచేడు. ఆమె ఆ ప్రాంతాల్లో అగుపించలేదు.

మోక్షదా అడిగింది. "అయితే దాన్ని ఎప్పుడుతీసుకొని వెళ్ళ నిశ్చయించుకున్నావు?"

హరీశుడు తలత్రిప్పుతూ "రేపే" అన్నాడు.

"నీ పెళ్ళాన్ని తీసుకుపోతున్నావు గదా అని అప్పు డప్పుడు వచ్చి నన్ను చూస్తూండటం మరచిపోకునాయనా! మధ్యమధ్య నీవు నాకు అగుపించకపోతూం టే... నే నీ కొంపకి తాళం వేసేసి..."

"లేదే—తప్పక వచ్చి చూస్తూంటా. కొంపని సరిగా సద్దుకోడం దానికి చేతకాకపోతే దాన్నికూడా అక్కడ ఆట్టే కాలం వుంచను" హరీశుడు నవ్వి చెప్పేడు.

మోక్షదా చిన్న నిట్టూర్పుని విడిచి వూరుకుంది.

అదేరాత్రి ఉత్తరాన్ని గురించి జరిగిన పేచీ విషయం సుశామను అడగటం హరీశుడు మరచిపోలేదు. దీనికి సుశామ మొదట్లో కొంచెం ఆశ్చర్యపడినా, ఏమీ మాటాడక వూరు కుంది. ఆమె మౌనాన్ని అంగీకారంగా నిర్ణయిస్తూ హరీశుడు తప్పంతా సుశామదే అనుకున్నాడు. నిజానికి సుశామ మాటాడక వూరుకోడానికి కారణం - తను జవాబిస్తే, కోప గించి తనను అసలు కలకత్తా తీసుకెళ్ళడమే మానేస్తారేమో ననే తలంపే.

సుశామ నూతన గృహములో ప్రవేశించేసరికీ చీకటి పడింది. అందుచేత యిల్లెట్లా వున్నదో చూడటానికి వీలు పడలే. ఉదయాన్నే మటుకు సుశామ తెల్సుకుంది – ఇల్లంత పాడుగా లేదని, పెద్దపెద్ద గదులు రెండూ, ఒక చిన్న వసారా వున్నాయి. ఒకదాంట్లో వంట, రెండోదాంట్లో సామానులు, పడక, బాగానే వుంది. పడకగది కిటికి తలుపులు తెరచి వుంచినట్లయితే ఎదురుగా రోడ్డు, ప్రక్కనే బుల్లి పార్కూ అగుపిస్తుంటాయి. కావలసినంత సందడి! అన్నిటికంటె ఆనంద కరమైన విషయం తను స్వాతంత్రురాలవ్వటం.

భర్త వుదయాన్నే భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళేడు. తన కాలక్షేపానికి కాస్త కబుర్లు చెప్పుకుందామన్నా సహా చరులే లేరు! తనొక్కర్తే వంటరిగా అట్లా కూర్చుంటే సాయంత్రము అయ్యేటట్లే అగుపించడములే.

ఆమె తన జీవితాన్ని చాలామట్టుకు పల్లెల్లోనే గడ పింది. అక్కడ, ఎటువైపు చూచినా, పచ్చనిచేలు కండ్లకి ఆనందాన్నిస్తూ అగుపిస్తూండేవి. కండ్లకేమీ అడ్డే వచ్చేవి కావు. కాని యిక్కడట్లా కాదు

ఎటు చూచినా ఆకాశాన్ని మింగ జూచే మిల్లు గోట్టాలు, పెద్దపెద్ద మేడలు, దృష్టికి అడ్డొస్తుంటాయి. నిర్మ లాకాశాన్ని గాని, పచ్చటి చేలనుగాని చూచే అవకాశ మిక్కడ లేకపోవడం సుశామకు కొంచెం కొరవగానే వుంది.

కాని సాయంసమయాలు మాత్రం అనుకున్నంత చప్పగా లేవు. స్నానం ముగించి, తలదువ్వుకొని కిటికీవద్ద కొచ్చి కూర్చుంటే, పార్కులోకి వచ్చి పోయే జనం.

పార్కులో ఆడుకునే పిల్లలు. ప్రొద్దుబళ్ళల్లో బోసినవ్వులు నవ్వుతూ వచ్చే పసిపాపలు...అగుపిస్తూండేవారు. అట్లాగే చూస్తూండగానే తనకి తెలియకుండానే క్రమంగా చీకటి పడేది. వక్కసారిగ వీధిలైట్లన్నీ వెలిగేవి. సుశామ వంట ప్రయత్నాలు చేసేది.

ఒకనాడు సుశామ వంటపొయ్యి రాజేసి, ఎసరు పొయ్యిమీాద పడేసి, కూరలు తరుగుతూ అనుకుంది... తనకుకూడా 'సోనా' వంటి బిడ్డవుంటే ఎంత బాగుండేది! సాయంకాల మయ్యేసరికల్లా – అబ్బాయికి చక్కని దుస్తులు తొడిగి ముఖానికి యింత పౌడరద్ది నిత్యమూ పంపిస్తూ వుండును. ఈసరికల్లా యింటికి తిరిగి వచ్చేసి 'అమ్మా' అంటూ పిల్చేవాడు. నవ్వుతూ తను అబ్బాయిని కౌగలించు కొని, అన్నము పెడుతూంటే వక్కొక్క ముద్దే తింటూ పార్కులోని సంగతులన్నీ చెప్పేవాడు.

ఎప్పుడో వకసారి తన స్నేహితురాలే కాబోలు చెప్పింది — ముప్పయిఏళ్ల స్త్రీకి, అదేదో మందు తాగితే పిల్లలు పుట్టేరుట. ఆ మందు కలకత్తాలో దొరుకుతుంది. తను మాత్రం తెప్పించుకొని ఎందుకు తాగకూడదా మందును? సుశామకు యీా కోరిక మనస్సులో చాలా కాలంనుంచి వుంది గాని ... మధ్యన సిగ్గొకటి అడ్డువచ్చి ఆమెను అడుగనీయకుండా వుంది. ఏమయినాసరే యీా విష యాన్ని యీానాడే భర్తతో చెప్పి తీరాలనుకుంది సుశామ.

ఆదినం మధ్యాహ్నన నెత్తిన జంగిడి పెట్టుకొని, బొమ్మలు, ఆటవస్తువులూ అమ్ముకుంటూ ఎవరో ఆ దారిన

వెళుతూండటం చూచిన సుశామ వాడిని పిల్చింది. కిటికీ క్రిందకు వచ్చి "ఏంకావాలి తల్లీ" అన్నాడు వాడు.

సుశామకు ఏమని చెప్పాలో తోచలే. ఆమె ముఖం సిగ్గుతో ఎర్రబడిపోయింది. గత్యంతరం లేనట్లు అడిగింది... "ఏదీ ఓ బొమ్మని చూపు."

బొమ్మలని అమ్మే ఆసామీ పెద్ద సెల్యూలాయిడు బొమ్మ నొకదాన్ని తీసి ఆమెకు చూపుతూ "నావద్ద వున్న బొమ్మల్లోకల్లా యిదే మంచిదమ్మా. ఖరీదు రెండు రూపాయలు" అని దానిని కిటికీగుండా ఆమెకు అందియ్యబోయేడు. బొమ్మ పెద్దదిగా వుండటంవలన కిటికీ చువ్వలలోంచి పట్టక పోడము చూచి తిరిగి అన్నాడు "అబ్బాయిని అటు పంపండి తల్లీ ! బొమ్మనిచ్చి పంపిస్తా"

సుశామ అటూ యిటూ చూచి మరీ కందిపోయిన ముఖంతో అన్నది " పోనీలే యింతకంటే చిన్నబొమ్మ వుంటే యియ్యి."

"ఇంతకంటె చిన్నదా? వద్దమ్మా. ఇదే తీసుకోండి... మంచిది."

"అబ్బే వద్దు, పెద్దది యింకోసారి తీసుకుంటా. ఈసారి చిన్నదే యిచ్చి పో" అన్నది ... వున్నవాట్లోకల్లా చిన్న బొమ్మవైపు చూపుతూ. బొమ్మలమ్మే అతను చిన్నబొమ్మను తీసి, కిటికీలోనుండి అందిస్తూ "అర్ధరూపాయి ఇవ్వండి—" అన్నాడు. సుశామ ఇచ్చిన అర్ధరూపాయను తీసుకొని బొమ్మలమ్మేవాడు సంతోషంగా వెళ్ళిపోయేడు... బేరమాడకుండా కొన్నందుకు.

సుశామకు బొమ్మను ఏంజేసుకోవాలో అర్థమవలేదు. తను చేసిన అర్థవిహీన కార్యానికి వెంటనే సిగ్గుపడుతూ, ఆమె బొమ్మ నిటునటు త్రిప్పి చూచింది. తర్వాత బొమ్మను నేలపై కూర్చోబెట్టి కాస్సేపు చిన్నపిల్లలా ఆడుకుంది. ఆడుకుంటూ ఆడుకుంటూనే అలసిపోయి, బొమ్మను అక్కున జేర్చుకొని నిద్రపోయింది ... మధుర స్వప్నాలతో.

హారీశు డిదంతా విన్నాక నవ్వుతూ, సుశామను దగ్గరగా లాగికొని అడిగేడు "నీకు పాపాయి కావాలికదూ! అంతేనా ?"

సుశామ సిగ్గుతో నవ్వి..." వెళ్దురూ ... ఎప్పుడూ హాస్యాలే, నిజానికి నక్కనాడైనా ఏదైనా మందైనా పట్టారు" అంది.

హారీశుడు మాటాడక వూరుకున్నాడు.

మరునాడే మందు సీసా వచ్చింది. త్రాగడానికి రుచి కరంగా లేదామందు. విషంలా వుంది. అయితేనేం...వుబ్బి పోతూ సుశామ కండ్లను మూసుకొని భగవంతుని ప్రార్థించి వక్క గుటకలో త్రాగివేసిందా మందును.



శనివారము సాయంకాలము హారీశుడు పల్లెకు వెళ్లేడు- తల్లిని చూడటానికిగాను. ఆదివారము అతను తిరిగి రాగానే సుశామ అడిగింది "సోనాను చూచివచ్చేరా ?"

"నాకు తీరిక చిక్కనిదే"

"తీరికే చిక్కలేదా ?" సుశామ చాలా బాధపడింది. "తీరికకూడ దొరకనంత పనిలో మునిగిపోయారా?" అంది బాధతోనే.

సుశామ పడే బాధను హరీశుడు గ్రహించుకొని అన్నాడు. "సరేలే, ఈసారి వెళ్ళినప్పుడు సోనాను తప్పక చూచివస్తా."

"వెళ్ళి వూరికే చూచివస్తే లాభంలే. వెళ్ళేప్పుడు మురుగుల జతాను, ఒక పేమువుయ్యాల తీసుకుపోయి యిచ్చేసిరండి."

"ఉయ్యాల యిస్తే యివ్వగాని - మురుగులజతా ? ఒకసారి అమ్మ..." అంటూ మధ్యలో ఆగిపోయి ఏదో ఆలోచించుకొని తిరిగి హరీశుడు డన్నాడు "ఆ మురుగుల జత మన అబ్బాయికే వుంటుంది..."

సుశామ మారుమాటాడక అతని ముఖంకేసే చూస్తూ చిలిపిగా నవ్వి - తలనూపుతూ అంది "అయితే అట్లాగే కానీయండి. కాని రేపే వక వుయ్యాల కొనుక్కురండి ... తర్వాత గుర్తుండదు."

మరునాడే బజారునుంచి వుయ్యాల వచ్చింది. శనివారంవరకు వుయ్యాలను ఎక్కడ వుంచాలో తోచక, కాస్సేపు ఆలోచించుకొని, సుశామ దూలానికి త్రాటితో వ్రేలాడదీసింది - కొత్త వుయ్యాలను.

శనివారం హరీశునికి పల్లె వెళ్ళడానికి వీలు చిక్కలే. పై శనివారం కాబోలు హరీశుడన్నాడు "సాయింత్రము నేను అమ్మని చూడటానికి వెడుతున్నా."

ఉయ్యాలను తీసుకుని వెళ్ళమంటుంది కాబోలునని లోలోపల భయపడసాగేడు హరీశుడు. కాని విచిత్రమేమంటే సుశామ ఉయ్యాల సంగతి ఏమాత్రం తలపెట్టక అంది, "ఆదివారం రాత్రికల్లా వచ్చేసెయ్యండి" అని.

ఇదీ మంచిదే. ఇతరుల పిల్లలకోసం పెద్ద పెద్ద వస్తువులను బోలెడంత దూరం మోసుకొని పోడంలో అర్థం ఏముంటుంది? హరీశు డీమార్పుకి కొలదిగా సంతోషించేడు కూడానూ.

హరీశుడు ఆదివారం రాత్రే తిరిగి వచ్చేసేడు. ఇంటికి చేరేసరికి దాదాపు పదిగంటలవ వస్తూంది. వీధి తలుపు మూయబడివుంది. సుశామ లోపల్లోపల తనలో తనే ఏదో సన్నగా పాడుకోవడం విన్పిస్తూంది. పూర్వమెన్నడూ ఆమె పాడటం తను విని ఎరుగడు. నిజానికి ఆమెకు సంగీతంకూడా ఏమీ రాదు. ఆశ్చర్యముతో హరీశుడు కిటికీకి దగ్గరగా జరిగి విన్నాడు — ఆమె ఏం పాడుతూందోనని. పిల్లలను నిద్రపుచ్చేందుకు తల్లులు పాడే పాట నామె పాడుతూండటం విన్న హరీశుడు స్తబ్ధుగా నిలబడిపోయేడు...కొన్ని క్షణాలు.

హరీశుడు తలుపును తట్టగానే సుశామ పాటనాపి తలుపువద్దకు వస్తూ అడిగింది "ఎవరువారు?" అని.

"తలుపుతియ్యి. నేనే."

వెంటనే ఆమె తలుపు తెరచి అన్నది "మీరిక యీ రాత్రికి రాలేరేమో అనుకుంటున్నా."

ఆశ్చర్య మేమిటంటే, సుశామ 'సోనా' సంగతిని తలపెట్టనే లేదు. ఈసారి హరీశుడు 'సోనామణి' యింటికి వెళ్లి చూచివచ్చేడు కూడాను.

గదిలోపల ప్రవేశించాక హరీశుడికి వుయ్యాలలో సెల్యూలాయిడు బొమ్మ పడుకోపెట్టబడి వుండటం అగుపించింది. బొమ్మ తలకు పట్టుటోపీ, కాళ్ళకు బూట్సు, చేతులకి బంగారపు మురుగులు అలంకరించబడి వున్నాయి కూడాను.

హరీశుడు ఫకాలున నవ్వి "మీా అబ్బాయేమిటి ?" అన్నాడు. సుశామ సిగ్గుపడి...చిరునవ్వు నవ్వి "అవున"ని తలనూపింది.

తర్వాత తర్వాత...ఏముంది ? బ్రతుకంతా నవ్వుల పాలే !

మరునాడు పిల్లివచ్చి పాలనన్నిటినీ పడతోసి పోయింది. హరీశుడు భోజనాన్ని ముగించి...అడిగేడు "యివ్వేళ పాలు యివ్వలేదే ?"

"అబ్బబ్బా ! అబ్బాయి చేసే చిలిపిపనులకి అంతు లేకుండా వుంది. నేను పట్టుకోలేకుండా వున్నానమ్మా ! ఇందాక అటూయిటూ పరుగెత్తుతూ పాలని తన్నేసేడు." హరీశుడీధోరణిని లక్ష్యపెట్టక నవ్వేసి లేచిపోయేడు. సుశామ యింకా అన్నది. "తర్వాత నాలుగేసేను. ఏడ్చి ఏడ్చి నిద్ర పోతున్నాడు – వెర్రినాన్న !"

రాత్రి నిద్రపట్టేవరకు సుశామ తమ కుర్రాడి సాహస కృత్యాల్ని గురించి, చిలిపిచేష్టల్ని గురించి రకరకాలుగా

వర్ణిస్తూనే వుంది. ఈ కుర్రాడిని గురించి చెప్పేమాటలకు ఒక అంతూ దరి అంటూ లేదు. హరీశు డివన్నీ వింటూనే నిద్రపోయేడు.

కాని సుశామ కండ్లేం మూతపడలే ప్రక్కమీద నుంచి లేచి, ఉయ్యాలవద్దకు వెళ్లి, కుర్రాడు నిద్రపోతూండ టాన్ని చూచి, నెమ్మదిగా వకవూపు వేసి కిటికీవద్దకుపోయి నిలబడ్డదామె. వీధిలో లైట్లింకా వెల్గుతూనే వున్నాయి. రోడ్డుమీద జనసంచారం పల్చబడిపోయింది. చుట్టుపట్ల జీవు లన్నీ సుఖంగా నిద్రిస్తూండగా యీ నిర్భాగ్య సుశాను మాత్రం నిద్రకుకూడా దూరమై ఎంతోసేపు అట్లాగే శూన్యంలోకి చూస్తూ నిలబడిపోయింది.

నిత్యమూ యిరువురి మధ్య 'అబ్బాయిని' గురించిన సంభాషణ ఏదో వకటి జరుగుతూనే వుంది. ఇప్పు డిప్పుడే హరీశుడు తనంతట తనే వచ్చి అడుగుతూన్నాడు, "పిల్లాడి తల్లి ఏంచేస్తూంది? అబ్బాయి ఏడీ" అంటూ.

"ఇప్పుడే బయటకు వెళ్ళాడు. ఏం?" అంటుంది సుశామ.

హరీశుడామెను హెచ్చరిస్తాడు "కుర్రాడిని అటూ యిటూ వదిలేస్తున్నావ్ — జాగ్రత్త! కలకత్తా వీధులనిండా ఎప్పుడూ బండ్లే! ఎప్పుడో వకనాడు—"

సుశామకు గుండెల్లో ఏదో పట్టినట్లయ్యేది. కొంచెం సేపు ఆగి, తనకి తాను ధైర్యం చెప్పుకొని తిరిగి అనేది, "ఎప్పుడూ కాదు. అబ్బాయి మీలాగ తెలివితక్కువ వాడను కున్నారా—!"

"అయితే నేనేనా తెలివితక్కువ వాడిని!"

"కాకపోతే! మొన్న నేగా ఐదు రూపాయల నోటును పారేసుకొన్నది. ఇది విని అబ్బాయి ఏమన్నాడో తెలుసా, 'ఒకసారి నాన్న చెవులు మెలిపెట్టవే - మళ్ళీ మళ్ళీ పారేసుకోకుండా' అని."

ఇద్దరి మధ్య కాస్సేపు నిశ్శబ్దం. తర్వాత మాటాడుకోడానికి ఏమీ అగుపించేవి కావు. ఆఖరికి సుశామే అనేది: "అబ్బాయి యింకా ఏమన్నాడో విన్నారా ?"

"ఏమన్నాడేమిటి?"

"నీ వొక్కర్తెవే వంట వండడం, యింటిచాకిరీ అంతా చేసుకోటం...చాలా కష్టం. నాకు త్వరగా పెళ్ళిచేయవే— కోడలొచ్చి ఆదుకుంటుంది" అంటాడు.

హరీశుడు నవ్వేసి "నిజంగానే?"

"అవును. నిజంగానే. అచ్చంగా పెద్దవాళ్ళ మాటలన్నీను" అనేది.

"అవును. ఇదంతా 'నీవు నేర్పిన విద్యయే' వాడికి."

"అయ్యో...నాదేముంది. వాడే నేర్పుతాడు మనకి."

ఇద్దరూ విరగబడి నవ్వుకునేవారు.

ఈ విధంగా సుశామకు ఆరు నెలలు సౌఖ్యంగా గడిచిపోయేయి. కాని సుశామ ఆరోగ్యం మాత్రమూ బాహ్యకంగా దిన దినమూ మార్పులు చెందసాగింది.

ఆమె కండ్లచుట్టూ నల్లటి చారలు ఏర్పడ్డాయి. ముఖములోని వర్చస్సంతా ఎటో పోయింది. కేశములు కూడ రాలిపోయి...తలకట్టు బాగా పల్చబడి పోయింది. వికృతంగా ముఖం సువిశాలమయింది.

హరీశు డిది గమనిస్తూనే వున్నాడు. ఆఖరికి వకనాడు అడిగేడు. "దినదినమూ యిట్లా అయిపోతున్నావేం సుశా? ఎప్పుడూ కూడా...ఏమిటా ఆలోచనలు?"

సుశాామ అతని మాటను నమ్మలేక పోయింది. అద్దము ముందుకు వెళ్ళి తనని తాను చూచుకుంటూ అంది "నాకేమి మార్పు కనిపించడం లేదే?"

"అవును. నీకు కన్పించడం లేదు! నీ ముఖాన్ని చూడ టానికి కూడా ఎట్లాగో వున్నంత విచిత్రంగా మారిపోయేవు"

"అంత వికృతంగా వున్నానా?"

"నిజమే...చూచుకోరాదు...అద్దంలో."

"నేనేం చేయగలను—మీరే చెప్పండి."

సుశాామ తన శరీరం వయిపు మరొకసారి చూచుకొని నిట్టూర్చి వూరుకుంది.

హరీశు డారాత్రి భోజనము ముందు కూర్చున్నాక ఆమె అన్నది "చూడండీ! ఎవ్వరికయినా పిల్లలు లేనంత కాలమూ... అందరూ ఆమెను ఏదో ఒకటి అంటూనే వుంటారు."

హరీశుడు మాటాడలే.

సుశాామ తిరిగి అన్నది "నేను చిన్నప్పుడు—చటర్జీగా రబ్బాయి, 'మోతీ'తో ఆడుకునే దినాలలో...ఎప్పుడూ నా కతను భర్తగా వుండేవాడు. ఇరవై నాలుగు గంటలూ మేం బొమ్మల పెళ్ళాలే ఆడుకుంటూండే వాళ్ళం. ఆ ఆటల్లోనే మా పిల్లలకు పెళ్ళిళ్ళవరకూ చేసేవాళ్ళం. కోడళ్ళను కూడా కాపరానికి తీసుకు వచ్చేవాళ్ళము. ఆ కోడలు వచ్చినప్పటి

నుండీ దెబ్బలాటలు...యివే మేం ఎప్పుడూ ఆడే బొమ్మలా టలు! ఇదంతా చూచి అమ్మ అనేది "ఇరవై నాలుగు గంటలూ 'చక్కటి యిల్లో' అని కోరే స్త్రీకి గృహమూ దొరకదు. ఎప్పుడూ 'భర్తో భర్తో' అనే స్త్రీకి భర్తా దొరకడు. నీ ముఖాన రెండో దే రాసిపెట్టున్న దేమోనే తల్లీ! ఎప్పుడూ 'భర్తో' అంటూంటావు."

మాట్లాడ్డం సంగతి వదిలేసి, హరీశుడు తలనన్నా పైకి ఎత్తలేదు. భోజనాన్ని ముగించి హరీశుడు..."పాలేవి?" అన గల్లేదు.

సుశామ పాలగిన్నెను తెచ్చి భర్తఎదుట పెడుతూ... నవ్వుతూ అన్నది. "మీరు నా అందాన్ని గురించి ఏమేమో అంటున్నారు. పిల్లల తల్లికి ఎట్లావుం టేనేం? అబ్బాయి అంటు న్నాడు—"

హరీశుడు కొద్ది దినాలనుంచీ 'యీ అబ్బాయి' ప్రసం గాలతో విసుగెత్తి పోయేడు. ఇప్పుడాతను ముఖాన్ని పైకెత్తి, ఎర్రపడ్డ నయనాల్తో సుశామ వైపు క్రోధంగా చూస్తూ చెప్పేడు. "ఇటుచూడు! ఎప్పుడూ కుర్రాడిని గురించేనా ప్రశంశ! ఇక ఆ పేరెత్తితే నేనీ కొంపలోంచి బయటకు పోతా."

ఈ వక్ర క్రోధ వాక్యము చాలు...తన స్వప్న సౌధాల్ని పునాదులతో నేల గూల్చడానికి.

మరుచటి దినమునుండి సుశామ పూర్తిగా మారి పోయింది. ఆమె వద్దనుండి అసలు మాటేలేదు. హరీశు డామెను పిల్చినాగాని పలుకక...నిశ్శబ్దంగా ముందునకొచ్చి

నిలబడేది. అతని వద్దనుంచి వచ్చే వక మాటకి...ఇరవై మాటల్లో కోపంగా సమాధాన మిచ్చేది...ఒక వేళ సమాధాన మిస్తే.

ఒకనాడు హారీశు డన్నాడు చిరాకుపడుతూ, ఆఫీసుకు ఆలశ్య మవుతూంది"

"నన్నేం చెయ్యమంటారు?"

"ఏం చేయమంటారంటే! వంట చేయవే?"

"నేను వండ లేనిక—యీ మాయవంట."

"అయితే నేనే వండుకోవాలా?"

"మీరు వండుకోకపోతే వంటమనిషిని పెట్టుకోండి."

"వంట మనిషిని పెట్టుకోడానికి ధనం లేకపోతేనో?"

సుశామ క్రోధాన్ని దిగమ్రింగలేక ... కక్కింది. "అయితే...యింకో పెళ్ళిచేసుకోండి."

హారీశుడు జబాబివ్వక తిన్నగా స్నానానికి నీళ్ళ గది లోకి వెళ్ళిపోయేడు. సుశామ తయారయిన వంటకాలను విస్తట్లో వడ్డించి, నిశ్శబ్దంగా కూర్చుంది—గడపవద్ద.

ఇంతేకాదు. నోరూ వాయీ లేని అచేతనాలతో కూడా సుశామ దెబ్బలాడటం నేర్చుకుంది. ఎక్కడైనా నేల వయిన కాలికి గిన్నెగాని అడ్డువస్తే వక్క తన్నుతో మూలకు పంపివేసేది. అద్దపుస్టాండు వదులయి నేలమీద సరిగా ఆనక పోతే వక్క దెబ్బతో సహస్ర ఖండాల్ని చేసేది. క్రమ క్రమంగా ఆమెలో ఉద్రేకం, పెంకితనమూ అధికమవ సాగేయి. హారీశు డిదంతా చూస్తున్నా, ఏమీ ఎరుగనట్లు, మాటాడక వూరుకున్నాడు. నిజానికి హారీశుడు కూడా విరక్తి

చెందినట్లు ఆమెతో మనస్సిచ్చి మాట్లాడ్డం పూర్తిగా మాని వేసేడు.

ఒకనాడు హరీశుడే కాబోలు తనంతటనే 'అబ్బాయిని' గురించి ప్రసంగంగాని చేయక పోవడంవల్ల, యీనాడది విని సుశామ చిరునవ్వయినా నవ్వకపోగా మండిపడుతూ అరిచింది. "అబ్బాయా? అబ్బాయి! అబ్బాయిని గురించి మాట్లాడ్డానికి ఎంత ధైర్యముంది మీకు? నాతో ఎప్పుడూ చెప్పకండి అబ్బాయిని గురించి. నాకు కుర్రాడు లేడు. ఉన్న వక్కడూ ఏనాడో చచ్చేడు."

హరీశుడీ ధోరణికి నిర్ఘాంతపోయేడు. ఆమె నోటినుండి పై విధమయిన సంభాషణ విన్నాక అతనికి తిరిగి నోరు విప్పడానికి ధైర్యమే లేకపోయింది.

ఆనాడు బజారునుంచి వస్తూనే హరీశుడు కేక వేసేడు. "సుశీ! ఒకమాట యిటు వచ్చిపో!"

సుశామ వెంటనే గదినుంచి బయటకు వచ్చింది. హరీశుని వెనకాలే వక దాసీ మనిషి వుండటం గమనించింది కూడాను. సుశామ ముఖంమీద చిరునవ్వు మెరిసింది వక సారి.

హరీశుడుడన్నాడు "చూడు. ఈ మనిషి నీకు పనికి వస్తుందేమో?"

"ఏమిటీ పనిమనిషా?"

"అవును. వక్కర్తెపూ... ఎన్నాళ్ళు కష్టపడతావ్!"

సుశామ భర్త ముఖంవైపు వకసారి కృతజ్ఞతా పూర్వక దృష్టుల్ని బరపించింది. తనంటే హరీశుడికి ఎంత

ప్రేమ! ఆనందాశ్రువులు ఆమె కండ్లను నిండేయి. వెంటనే వాటిని గోటికొనతో మీటి, పనిమనిషిని సమీపించి,

"నీ పేరేమిటన్నావ్? పనీ అదీ సాగా చేతనవునా? రా—నాతో" అంటూనే సమాధానం కోసమన్నా ఎదురు చూడక, పనిమనిషిని లాగికొని వంటయింట్లోకి వెళ్ళి పోయింది— సుశామ.

నూతనంగా పనిలో ప్రవేశించిన పిల్లకి పది హేనేళ్ళుంటాయి. పేరు 'సరూ' పనిలో బహుచురుకు.

సుశామ ఆమె పనితనాన్ని మెచ్చుకుంటూ పది నిమిషాల తర్వాత భర్తతో అన్నది "పనీ అదీ...ఫస్టు! ముందునాకు మాట్లాడుకోడానికి స్నేహితురాలు దొరికింది ......పనిసంగతి దేముడెరుగు"

హరీశుడు నవ్వుకొని... "నేను... అదే..." అని వూరుకున్నాడు.

పనిమనిషి వచ్చేసరికి సుశామ ఆరోగ్యం బహు హీనస్థితిలోవుంది. కాళ్ళూ, చేతులూ పూచికపుల్లల్లా సన్నగా వ్రేలాడుతున్నాయి. ముఖం రక్తమాంసాలు లేనట్లు ఎండిపో యింది. ఇక భోజనము...నిద్ర...సౌఖ్యం...అనే వాటి విష యం మరిచేపోసాగినది.

పని మనిషి సాయం వచ్చిన తర్వాతనే ఆమె కొం దిగా కోలుకొన సాగుతూంది. ఈ మార్పును చూచిన హరీ శుడు కూడా తన తెలివికి తనని తానే మెచ్చుకున్నాడు... వొకటి రెండుసార్లు.

అకస్మాత్తుగా మోక్షదా వద్దనుంచి వక టెలిగ్రాం వచ్చిందీనాడు. ఆమె చనిపోవ సిద్ధంగా వుందిట. హారీశుని వచ్చి వకసారి చూచిపొమ్మని తంతి! చేతిలోని టెలిగ్రాం చేతిలోనే వణుకుతూండగా హారీశుడు గాబరా పడసాగేడు "ఏం చేద్దాం సుశీ! అమ్మ చచ్చిపోతూందిట!" అంటూ.

మోక్షదాకు జబ్బుగా వున్నందువల్ల, తననికూడా హారీశుడు తన వెంట పల్లెకు రమ్మన మంటాడేమోనని అనుకుంది సుశామ. నిజానికి ఆమెలో మోక్షదాను చూద్దామనే వాంఛకూడా ఆట్టే లేదు. అందుచేత కాస్సేపు ఆలోచించి ఆమె అన్నది. "మొదట మీరు అక్కడకు వెళ్ళి పరిస్థితులేమో చూడండి. ఆరోగ్యం...ప్రమాద స్థితిలోవుంటే... తర్వాత నేను బయల్దేరి రావచ్చు..."

ఈ ఆలోచన హారీశునికి కూడా నచ్చింది, వెంటనే ఆఫీసుకు వెళ్ళి సెలవు చీటీ వ్రాసేసి, అక్కడనుంచి అటే స్టేషనుకు వెళ్ళిపోయేడు.

రెండవ రోజున హారీశుని వద్దనుంచి జాబు వచ్చింది. మోక్షదా ఆరోగ్యం బాగా లేదుట, గాని సుశామ బయలుదేరవలసినంత హీనంగాను లేదట. అవసరం అనిపిస్తే హారీశుడే వచ్చి ఆమెను వెంటపెట్టుకొని పోతాడుట!

నాల్గవ దినాన మరో వుత్తరం...మోక్షదా ఆరోగ్యం కోలుకుంటున్నదనీని...అయిదారు దినాల్లో తను బయలుదేరుతాననీ...

హారీశుడు తిరిగి మోక్షదా....కులాసాగానే వుందన చెప్పేసరికి...పది దినాలు పట్టేయి. ఇంట్లో అడుగు పెడుతూనే

...తిరిగి వృత్యాల వ్రేలాడదీయబడి వుండటం...హారీశుడు గమనించి నవ్వుకున్నాడు.

సుశామలోని నైరాశ్యమూ, విచారమూ అట్లాగే వుండటం చూచి, హారీశుడా రాత్రి ఆమెను దగ్గరగా లాగి కొని లాలిస్తూ అడిగేడు.

"సుశీ! ఏమిటట్లా ... ఆరోగ్యం సన్నగిల్లుతూంది? నన్నేం చేయమంటావ్...చెప్పవూ?"

భర్త వద్దనుండి యీ మాదిరి ఆదరాన్ని పొంది... ఎన్నో యుగాలయినట్లు అన్పించింది సుశామకు. కాగా కన్నీ రును తుడుచుకుంటూ అన్నది "మీరేం చెయ్యాలి...అంతా విధివ్రాత."

హారీశుడేదో ఆలోచించుకొని చెప్పేడు. "పోనీ,... కొన్నాళ్ళు ఛేంజికిపోయి వుంటావా...! అక్కడ ఎటువంటి వాళ్ళ అనారోగ్యమయినా బాగుపడుతుందిట!"

"ఎక్కడికీ? ఛేంజికా! నాకు వెళ్ళడానికి ఎక్కడైనా మాత్రంఏమివుందని...!" ఆమె ఒకసారి నిట్టూర్చి...హారీశుని చూచి నవ్వినది విషాదంగా. హారీశుడు మరేమీ మాటాడ లేదు. ఆమెకూడా మూకీభావం వహించింది.

ఒకనాడు అనుకోకుండానే సుశామ పేర పోజాబు వచ్చింది. అడ్రెసుమీద దస్తూరి స్త్రీదిలా స్పష్టంగా అగు పిస్తూనేవుంది. సుశామ కవరును చించి...తన మిత్రురాలు చపల వ్రాసినట్లు తెలుసుకుంది. సుశామ ఆనందంతో నవ్వు కుంటూ ఉత్తరం చదువుకోడానికి కూచుంది. చపల వ్రాసింది.

సఖీ!

ఎంతో విచారముతో యీ వుత్తరాన్ని వ్రాయడానికి పూనుకుంటున్నా. నీ అడ్రెసు యింతవరకూ నాకు తెలియక పోవడంవల్ల జాబు వ్రాయలేకపోయా, సోనాతండ్రి మొన్ననే హారీశుని అడిగి తెచ్చేరు.

కావి వక్కమాట అడుగుతా...చెప్పు. నీకు ఏమాత్ర మయినా జ్ఞానంవుందీ? ఇంత చిన్న వయస్సులోనే యిక సంతానవతిని కావని నిరాశపడటంలో అర్థముందీ!

"నీకూ తెలుసనుకుంటూ భర్తని యమధర్మరాజు చేతి లోనయినా చిక్కనీయవచ్చును గాని...మరో స్త్రీ చేతికి చిక్కనీయరాదని..." అని, ఆఖరికి నీవేచేసేవా...కూడని పనిని! హారీశుడు తిరిగి వివాహం చేసుకుంటున్నాడని మొదట నేనిని నమ్మలేక పోయే, అతను నిజంగానే తిరిగి పెళ్ళి చేసు కున్నాడని, భార్యను కూడా యింటికి తీసుకొచ్చేడని... మొన్ననే కళ్ళారా చూచి తెల్సుకున్నా. ఈ పెళ్ళిని తాపీ తల్లి, మోక్షదా ఏర్పాటు చేసేరట! పెళ్ళికూతురు...తాపీ తల్లి, ప్రథమ కుమార్తె.

ఇందులో నీ అంగీకారం కూడా వున్నదని విన్నా. అదే నిజమైతే... చెల్లీ! ఎంత పొరపాటు చేసేవ్...

ఈ విషయం విన్నప్పటినుంచీ... నేను అమితంగా బాధపడుతున్నా. జబాబు వెంటనే వ్రాయి...

నీ ప్రాణసఖి

చపల.

సుశామ చేతులు వణికాయి. తను ఏమిచేయాలో...
అర్థము కాలేదు. శరీరమంతా దహించుకుపోతూన్నట్లు బాధ
పడుతూ...దిండులో తలదాచుకొని...నిశ్శబ్దంగా దుఃఖించ
సాగింది.

హరీశుడు ఆఫీసు నుంచి యింటికి తిరిగి రాగానే
సుశామ చాలా ప్రశ్న లతన్ని అడుగుదా మనుకుంది. తన
నెందుకీ విధంగా గొంతు కొయ్యాలి? తనకి 'నా' అనేవారు
ప్రపంచములో మరెవ్వరూ లేరనేనా? చంటిబిడ్డలా తను తన
'మనఃప్రాణాలను' అతని చేతిలో సురక్షితముగా వున్నాయని
నమ్మితే ... అకస్మాత్తుగ యిట్లా గొంతు పిసుకడం ...
న్యాయమేనా? తను ఏమి నేరం చేసినందుకీ శిక్ష? తనముందు
సంగతి ఏమిటి? తనకీ విశాల ప్రపంచములో ఇక స్థానమే
లేదా? కానీ హరీశుని చూడగనే...ఆమెలో ఆమె తర్కించు
కొన సాగినది..."యీ వ్యక్తేనా తన నిట్లా...నిలువునా
దహింప జేస్తు! తన భర్త హరీశుడేనా...యితను!" సుశామ
ఎందుకో ... నమ్మలేకుండా వుంది...తన హరీశుడీ పనిని
చేసేడంటే! భోజనం ముందు కూర్చున్న హరీశు డామె
మౌనాన్ని చూచి...అడిగేడు, "రాణీ! ఏమిటివ్వేళ మౌన
ముద్ర ధరించావ్...! ఏం జరిగింది?"

సుశామకు...ఎంత ప్రయత్నించినా మాట పెగలలే.
హరీశుడు భోజనం ముగించి...పడక గదిలోకి వెళ్ళిపోయేడు.
సుశామ ఎంగిలి పడకుండానే లేచి, వంట యిల్లును కడుక్కొని.
సామాగ్రి సర్దుకొని...పడక గది చేరుకుంది.

హారీశునికి అప్పుడే నిద్రపడుతూన్నట్లుంది...సుశామ అడుగుల చప్పుడుకు కొద్దిగా వత్తిగిల్లేడు. భయపడుతూ... ఆమె అతని చేతిని తాకి అన్నది, "ఇదుగో—వినండి"

హారీశుడు నిద్రమత్తుగా..."ఏమిటీ"అన్నాడు.

అంత సేపటి నుంచి తను అడుగుదామని యత్నిస్తూన్న ప్రశ్నలన్నీ లోపల్లోపలే అణగారి పోయేయి. ఒక్క సారిగా ఆమె పెదవులు వణక సాగినాయ్; కన్నీరు అప్రయత్నంగా కారసాగింది.

హారీశుడే తిరిగి అన్నాడు "ఏమిటంటున్నావ్?"

సుశామ అన్నది "ఏమీ లేదు...ఏమీ—లేదు." బొంగురు పోయిన ఆమె స్వరాన్ని బట్టి ఆమె దుఃఖిస్తూన్నదని హారీశుడు చులాగ్గా గ్రహించేడు. వెంటనే నిద్రదూరమవగా, లేచికూచుని ఆమె చేతిని పట్టుకొని అతనడిగేడు " సుశామ ! దుఃఖిస్తూన్నావా?ఏం?"

ఈమాటతో కట్ట తెగింది. దుఃఖం వక్కసారి పొంగి, పొర్లి, వెల్లువలయి ప్రవహించింది.

హారీశు డాశ్చర్యపడుతూ... " ఏంజరిగింది సుశా ! ఎందుకీ దుఃఖం చెప్పవూ?" ప్రశ్నించేడు.

సుశామ వెక్కుతూ చెప్పింది "నన్నెందుకు ఛేంజికి వెళ్ళమంటూన్నారో...అర్ధమయింది...నేనేం పాపంచేసే..."

"ఏమిటిది? ఏం తెల్సింది నీకు? ఎందుకంటావు? చెప్పు...ఏమిటో...చెప్పు..." ప్రశ్నపై ప్రశ్నను వేయసాగేడు తబ్బిబ్బవుతూ... పట్టుపడ్డ దొంగలా.

ఎక్కిళ్ళవల్ల సుశామకు వూపిరి తీసుకోనడం కూడా అసాధ్యమవటంచే అతని ప్రశ్నల కింకేమి జవాబివ్వగలదు! నెమ్మదిగా... దుస్తులక్రింద దాచిన లేఖను తీసి... హారీశుని ముందుకు చేతిని చాచిందామె.

గది చీకటిగా వుండటంవల్ల. . .ఆమె చేతిలోని లేఖో, కవరో. . .మరేమో. . .కన్పించక పోగా. . .హరీశుడు లేచి, స్విచ్చి వేసేడు.

సుశామ చేతిలో కవరు వుండటం చూచి హారీశుడు చకితుడయ్యేడు. లేఖను పూర్తిగా చదివేక హారీశునికి అర్థం కాకుండా మిగిలినదేమీ లేకపోయింది. మొదటినుంచి తను ఏది జరుగుతుందని భయపడ సాగేడో అదే జర్గింది! ఎంత ప్రమాదం!

అయితే, ప్రస్తుతం సుశామ విచారాన్ని ఏవిధముగా వుపశమింప చేయ తల్చుకున్నదీ హారీశునికే అర్థముకాలేదు. ఇదే విషయాన్ని ఆలోచిస్తూ, వణికే వ్రేళ్ళతో వృత్తరాన్ని మడుస్తూ, తెరుస్తూ, కాస్సేపు అట్లాగే నిలబడిపోయేడతను. . . .పాలిపోయిన ముఖంతో సుశామ తలగడాలో తలను దాచుకుని. . .దుఃఖిస్తూంది. ఇంకాస్సేపు అట్లాగే నిలబడి హారీశుడుకూడా పక్కమీద వాలేడు.

కలతనిద్రలో రాత్రినిగడిపిన హారీశుడికి నిద్రలేచే సరికి బాగా ఆలస్యమయ్యింది. సుశామ ఎప్పుడు లేచినదీ, అసలు నిద్రపోయినదీ లేనిదీ కూడా హారీశునికి తెలియదు.

ఏదియెట్లావున్నా, యీాదినము వుదయాన్నే సుశామ లేచి వంట ప్రయత్నాలు చేయడం హరీశునికి ఆనందంగా వుంది. ఎందుకంటే గాయపడ్డ హృదయం కోలుకోడానికి కొంత ఆలస్యమవుతుంది. సుశామ యీ స్థితిని. . .ఆట్టే కాలం పుచ్చుకోకుండా వెంటనే దాటేసింది. ఇక ఆమె ఆరోగ్యాన్ని గురించి తను ఆట్టే భయపడనక్కరలేదు.

తేలికపడ్డ హృదయంతో, హరీశుడు కాలకృత్యాలను ముగించుకొని, గదిలోకి వచ్చేసరికి పొగలుకక్కుతూన్న 'టీ' కప్పును తెచ్చి సుశామ బల్లపై పెట్టింది.

హరీశుని ఆనందానికి మేరలేక పోయింది. ఆమె చీర కొంగును పట్టుకొని సుశామను దగ్గరగా లాగికొంటూ అన్నాడు "సెభాస్! మనిషంటే అట్లా వుండాలి! ఆమె ఎవ్వరూ?. . .నీముందు. . .ఎందుకూ కొరగాదు. విచారించకు నారాణీ. . .విచారించకు."

సుశామ యిదివిని నవ్వనూలేదు, దుఃఖించనూలేదు. ఆఖరికి ముఖాన్నయినా పైకెత్తలేదు. హరీశుని చేతిని విడిపించుకొని . . .నిద్రలోనడుస్తూన్నట్లు. . . పరధ్యానంగా. . . వంటయింటివైపు నడచి వెళ్ళిపోయింది.

హరీశుడు స్నానాన్ని ముగించి భోజనమువద్ద కూర్చున్నాక కూడా, అతనికి ఏవిషయంలోనూ లోటుబొట్లగుపించలే. వంటకాలు కూడా, ఆ దినం నిత్యమూకన్న క్రొత్త రుచులూరుతున్నాయి. మామూలు టైముకంటే ముందుగానే యీనాడు వంటకూడా పూర్తయింది. హరీశుడు సం

తృప్తిగా భోజనంచేసి, లేచి చెప్పేడు—"పిచ్చిపిల్లా! విచారించకు."

ఇది అతని నోటినుండి వచ్చీ రాగానే, సుశీమ నయనాలనుండి కన్నీరు జలజల కారుస్తూ......"విచారమా? అబ్బే—" అని పైకిఅంటూ...మనస్సులోనే అనుకుంది... "నేను దహించుకు పోయినా......నా మనస్సునుంచి యీ బాధ తొలగిపోతుందా?"

ఆఫీసుకు వెళ్ళేడన్న మాటేగాని...హరీశుని మనసంతా...ఎట్లాగో వున్నది. ఎప్పుడు సాయంత్రమవుతుందా అని ఎదురు తెన్నులు చూస్తున్నాడు...మనస్సుచుట్టూ మూగే కందిరీగల్లాంటి తలంపులను తరిమివేస్తూ. ఆఖరికి...అయిదయ్యింది హరీశు డింటిముఖం పట్టేడు.

తన యింటి ఎదుటగా జనసమూహం కూడుకుని వుండటం హరీశుని కండ్లబడింది. ఏమిటివంతా? దొంగతనమా! హత్యా? హరీశుడు ఆశ్చర్యపడుతూ...పెద్ద పెద్ద అంగలతో గృహాన్ని చేరుకున్నాడు. పోలీసులిద్దరు జనాన్ని వెనక్కి త్రోసి అణచివుంచుతూన్నారు కూడాను!

హరీశుడు...దడదడలాడే గుండెలతో, గుమ్మాన్నెక్కుతూండగా...ఎక్కడనుండో 'నీరూ' శోకాలు పెడుతూ అతని కాళ్లమీదపడి..."ఎప్పుడూ అనుకోలే—బాబూ...! ఎ-ప్పు-డూ ..." అంటూ బెక్కసాగింది.

"ఏమిటీ 'అనుకోలే'నిది? ఎవరు అనుకోలే! విషయమేమిటి?" ఇదంతా దాసీని వూరడించి నెమ్మదిగా తెలుసు

కునే ఓర్పు హారీశుడిలో—ఏమాత్రమూ లేకపోయింది. దాసీ దాని స్థితికూడా...విషయాన్ని స్పష్టంగా, సంగ్రహంగా చెప్పే పరిస్థితిలో లేదు. కాగా హారీశుడు చిరాగ్గా దాసీని తప్పించుకుని ముందుకు నడిచేడు. వీధితలుపు తెరవబడేవుంది.

పడక గదిముందు నిలబడివున్న ఇద్దరు యింగ్లీషుదుస్తులలోని వ్యక్తులు, హారీశుని చూచి అన్నారు "తమరేగా గృహ యజమాని?"

విస్తుపోయి హారీశుడు తడబడుతూ "అవును."

"మీ దాసీవల్ల విషయాన్ని వినగానే పరుగెత్తుకొని వచ్చేం. ఇంత చిన్న వయస్సులో...యింత .."

హారీశుడిక ఆ మాటే వినడానికి అక్కడ ఆగలేదు. వెర్రివాడిలా మూయబడ్డ పడకగది తలుపులను త్రోసుకుని లోపలకు ప్రవేశించేడు. గదంతా చీకటిగా వుండటంవల్ల వెంటనే ఏమీ అగుపించలేదతనికి. హారీశుడు గుడ్డిగా ముందుకు... కిటికీతలుపులవైపు నడిచేడు– దారిలో భుజాన్ని ఏదో వస్తువు రాసుకున్నా లెక్కచేయక.

వెల్తురులో—సుశామ శరీరం గదిమధ్యగా వ్రేలాడుతూండటాన్ని చూచిన హారీశుడు, వెనక్కి రెండడుగులు వేసి, వెర్రికేక వేస్తూ కూలబడి పోయేడు.

ఉయ్యాలకు కట్టబడ్డ త్రాళ్ళలో వక త్రాడు తక్కువయినందున, ఉయ్యాల ఎగుడు దిగుడుగా వ్రేలాడుతూంది. సుశామ వ్రేలాడుతూన్న ప్రదేశం దగ్గరనే...వో కుర్చీ తలక్రిందులుగా పడివుంది.

హారీశుడింకా అట్లాగే మతిపోయిన వానిలా శవంవంక చూస్తూండగానే, పోలీసు యినస్పెక్టరు లోపలకొచ్చి, మెడకు బిగింపబడ్డ త్రాటిని కోసివేసి అన్నాడు. .."శవాన్ని హాస్పట లుకు పంపిస్తున్నాం."

హాస్పటలు ఆంబులెన్సు వికృతంగా అరుస్తూ శవాన్ని మోసుకుపోయింది.

తర్వాత హారీశునికి ఏమి జరిగినది, తాను ఏమి చేస్తున్నదీ. . . తెలవనేలేదు. తనకి స్పృహా వచ్చేసరికి. . .తను హాస్పటలు వెయిటింగు రూములో కూలబడి వున్నాడు.

పది గంటలు అవుతూండగా, డాక్టరు వచ్చేడు. వెన కాలే యిద్దరు నర్సులు, కొందరు స్టూడెంట్సు.

"ఆమె మీ భార్యా. . .?" డాక్టరు అడిగేడు.

"చిత్తం" అంటూ తల నూపేడు హారీశుడు.

"ఆమె గర్భవతిగా వున్నదని. . .ఆమె అనుకున్నదా?"

తలనూపుతూ 'లేదని' చెప్పేడు హారీశుడు.

డాక్టరు చిరునవ్వు నవ్వుతూ తన ననుసరించమంటూ ముందుకు నడిచేడు.

హారీశుడు యంత్రములా డాక్టరు వెనుకే నడుచు సాగేడు. . .Morgue మేడపైకి. పెద్ద గ్లాసు బల్లపైన పరుండ పెట్టబడిన సుశామను చూడగానే అతనిలో దుఃఖం పెల్లుబి క్కింది.ఆమె శరీరమంతా ఖండించబడి, దగ్గరగా అతికించబడి వుంది. పాపిటిలోని కుంకుమ ఎర్రగా మెరుస్తూ—సూర్య రస్మిలో వింతశోభనిస్తూంది ఆమె ముఖానికి.

హారీశుడామెను చూచి, ముఖాన్ని చేతులతో కప్పుకుని కుర్రాడిలా ఏడుస్తూంటే, జాలిగల విద్యార్థి వకడు సుశామ శవంపై తెల్లటిగుడ్డను కప్పేడు.

డాక్టరు తన చేతిలోని గుడ్డలో దాచబడ్డ వస్తువును పైకెత్తి—'యిటురండి'అన్నాడు హారీశుని పిలుస్తూ.

డాక్టరు చేతుల్లో...యింకా పూర్తిగా ఎదగని పసిగుడ్డొకటి వుంది. పసిపాపకు, చేతులు, కాళ్ళు, ముక్కు తల ఏర్పడ్డాయి. కండ్లుమాత్రం యింకా తెరవలే—మరి తెరుచుకోవు గూడాను.

"ఆమె గర్భంతో వుండగా...ఆత్మహత్య చేసుకుంది. పూర్తిగా పెరగని యీ గుడ్డును బయటకుతీసేం"...డాక్టరు చల్లగా చెప్పేడు.

హారీశునికి—తర్వాత చేయడానికేమీ ఆట్టే మిగల లేదు కూడాను—వెర్రివానిలా నేలనుపడి దుఃఖిస్తూ గోడకు వేసి తలను తపతప బాదుకోనడం తప్పితే!

# రా ధా రా ణి

వీధినాటకాల జట్టొకటి ఆనాడు ఎక్కడనుండో ప్రత్య క్షమయ్యేసరికి ఆ పల్లెలోని వాతావరణం కాస్తా క్షణంలో మారిపోయింది.

వచ్చినజట్టు చిన్నదేమీకాదు. ఇద్దరు ముగ్గురు సేవ కులు, ఒక వంటమనిషి, మిగతా వాళ్లంతా నటులు. అంతా కలసి ముప్ఫయిరెండుమంది. తూర్పుదిశనున్న ఒక గ్రామంలో కొన్ని ప్రదర్శనలిచ్చి, వుత్తరాభి ముఖంగా వెళ్తున్నారు వాళ్లు. అపరాహ్ణం దాటడంవల్ల, ఐశ్వర్యముతో తులతూగు తున్నట్లు కన్పించే ఆ గ్రామం చివర చెరువుగట్టుమీదున్న మర్రిచెట్టు నీడని విశ్రమించేరు.

రక్తారుణిమ నేత్రాలు కల్గిన మధ్య వయస్కుడొకడు, సేవకులచేత నేలంతా శుభ్రం చేయించేడు. మరోసేవకుడు మూడురాళ్లు తీసుకొచ్చి పొయ్యి తయారుచేసేడు. వంట మనిషి, తన సంచి తెరచి గారడీ వాడిలాగ అల్యూమినం గిన్నెలు, తప్పాళాలు, బూర్లెమూకుడు, గరిటెలు బయట పెట్టేడు. జట్టులోని మిగతావారు యీలోగా ప్రక్కనున్న చెరువులో దిగి, ధూళిధూసరితాలైన చేతుల్ని ముఖాల్ని తడుపుకుని తుడుచుకొని, చిరిగిన చాపలను దుప్పట్లను తీసి, నేలపైన పరచి నడుములు వాల్చేరు. పరుండటానికి అందరికీ స్థలం లేనందువల్ల కొందరు తుండ్లు పరచుకొని

కూర్చున్నారు. ఆ జట్టులో బాలురు చాలామంది వున్నారు. వాళ్ళెక్కడా అలసినట్లు ప్రవర్తించడం లేదుగాని ముఖాలు మాత్రం పీక్కుపోయి వున్నాయి. వాళ్లు కాలక్షేపం కోసం ఆతృతగా నలుదిక్కులా గమనించ సాగేరు. వాళ్ళు పెద్ద వాళ్ళకి తెలియకుండా కండ్లతోనే మాట్లాడు కుంటున్నారు. వాళ్ళ దృష్టులనుబట్టి అప్పుడే కుర్రవాళ్ళు ఎవరో యిద్దరికి జగడం ప్రారంభమయినట్లు తెలుస్తోంది.

మధ్య వయస్కుడు హడావడిగా అటుఇటు తిరుగుతూ, "పశుపతీ! పడుకున్నావా? లే! లే! లేచి-ఓ దమ్ములాగి, బజారుకెళ్ళి కావలసిన సరుకులేవో పట్టుకురా! ఊ! రామూ! ఏమిటి - అప్పుడే గుర్రా? లేవోయి... లేచి బంగాళా దుంపలు తరుగు" అంటూ కేకలేసేడు.

ఆ మధ్య వయస్కుడు ఆ నాటకాల జట్టుకి మేనే జరు. నాటకాలలో కంసుడు, భీముడు, యింకా ఏ పాత్ర ధరించాల్సి వచ్చినా ఆయనే ధరిస్తూంటాడు. ఆయన మొహంలో సహజంగా వుండే క్రౌర్య, గంభీరతలను చూసి ఆయనంటే జట్టులోని వాళ్ళంతా భయపడుతూంటారు. పిల్లల సంగతి చెప్పనే అక్కరలేదు. ఆయన దగ్గరకు వెళ్ళడానికే భయపడతారు.

లేద్దామని అనుకుంటూనే పశుపతి మళ్లా కళ్ళు మూసుకున్నాడు. "ముల్లాయనుడి బండికూడా వచ్చేసింది. లే. లే." అని కర్కశంగా అరిచేడు మేనేజర్ మళ్ళీ.

ముల్గాయనుడి బండి నిజంగానే వచ్చింది. ఆ బండి నిండా పెద్ద, చిన్న పెట్టెలు చాలా వున్నాయి. ముల్గాయ

నుడు పైనున్న పెట్టెమీద గొడుగు వేసుకుని కూర్చుని వున్నాడు. ఆయన ప్రక్కనే యిద్దరు కుర్రాళ్ళు కూడా కూర్చుని వున్నారు. ముల్గాయనుడు ఆ జట్టుకి యజమాని. కృష్ణ గాధకి సంబంధించిన నాటకాలలో బృంద, యశోద మొదలైన వేషాలు అద్భుతంగా వేస్తూ వుంటాడు. హాయిగా పాడతాడు. ఆయన వయస్సు యింత అని నిర్ణయించలేము. మనిషి మాత్రం సన్నగా, పొట్టిగా, అందంగా వుంటాడు. ఆయన ప్రక్కనున్న యిద్దరు కుర్రాళ్ళలో ఒకతను రాధ వేషం, మరో అతను కృష్ణుడి వేషం వేస్తూంటారు.

ముల్గాయనుడి బండిని చూసిన పశుపతి మరి ఆలసించక, లేచి యిద్దరు సేవకుల్ని వెంటబెట్టుకొని బజారుకు వెళ్ళాడు. ముల్గాయనుడు బండిమీదనుంచి దిగి, చిరునవ్వుతో అన్నాడు, "ఘోషాల్ మహాశయా! అప్పుడే గృహం ఏర్పాటు చేసేరే! అందుకనే బ్రాహ్మణుని భూసురుడన్నారు. వాళ్లెప్పుడు దయతలిస్తే అప్పుడు లక్ష్మీదేవి ధనధాన్య వస్తు వాహనాలు కురిపిస్తుంది కదా!"

ఆ పొగడ్తతో ఘోషాల్ మహాశయుడి ముఖారవిందం వికసించింది. వెంటనే అధికార పూరిత స్వరంతో, "రాధా! దుప్పటి పరిచి, కాళ్ళూ చేతులు కడుక్కోడానికి కాసిని నీళ్లు పట్టుకురా. ఠాకూర్! కొంచెం షర్బత్ తయారు చెయ్యి" అన్నాడు.

"మీరంతా భోజనాలు చేసేరా?" అని ప్రశ్నించేడు ముల్గాయనుడు.

"ఆ! దారి మధ్యలో నదివడ్డున భోంచేసేం."

"మంచి పనిచేసేరు. నేనూ దారిమధ్య కుర్రాళ్ళిద్దరికీ భోజనాలు పెట్టించేను." అని చెప్పి, రాధాకృష్ణుల వంక ప్రేమపూరిత దృక్కులను బరిపేడు ముల్లాయనుడు. క్షణ మాగి మళ్ళీ అన్నాడు. "కాని, యిప్పటికి చాలా సేపయ్యిం దిగా భోజనాలయ్యి. కాస్త షర్బత్ పుచ్చుకుంటా రేమిటి?"

"ఆగండి–వస్తున్నా. ఆ సుందోప సుందులు చూడండి. నరుక్కుంటున్నారు." అంటూ కుర్రాళ్లవైపు పరుగెత్తేడు మేనేజరు. అంతవరకు వకరి నొకరు తీవ్రంగా చూసుకుంటూన్న కుర్రాళ్ళిద్దరూ కొంచెం దూరంలో, దృక్కులతో సమరం మాని ముష్టి యుద్ధానికి తలపడ్డారు.

మేనేజరు దగ్గరకు రాగానే కుర్రాళ్ళిద్దరూ ఒకరి నొకరు వదిలేసేరు గాని, వాళ్ళ నాసికా పుటాలు మాత్రం క్రూర మృగాల్లా క్రోధంతో బుసలు కొడ్తున్నాయి. మేనేజరు యిద్ద రికి చెరో చురుకు తగిలించి, ఎడం ఎడంగా కూర్చోబెట్టి తిరిగి వచ్చేడు.

"హరిదాస్ బెల్లం పట్టుకు రావడానికి బజారు వెళ్లేడు. రాగానే అంతా పానకం తాగుదురుగాని," అన్నాడు ముల్లా యనుడు.

"ఇవ్వేళ మీారేదో సరదాపడి యిస్తే, రేపట్నుంచి వీళ్లకి యిదే అలవాటయిపోతుంది. మీాదగ్గరకు రారుగాని, మధ్య నన్ను తినేస్తారు" అంటూ మేనేజరు జట్టువైపు తిరిగి "ముల్లాయనబాబు తన స్వంత ఖర్చుమీాద మీా అందరికీ పానకం యివ్వబోతున్నారు యివ్వేళ. రోజువారి బత్తెంతో దీనికేమీా సంబంధం లేదు" అని బృందానికి స్పష్టంచేసేడు

కుర్రాళ్ళిద్దరూ యింకా బెక్కుతూనే వున్నారు. హఠాత్తుగా మేనేజరు పళ్ళు పటపట కొరుకుతూ, "నోర్మ్యూయ్యండి. ఊ! నోరుముయ్యమంటే అర్థంకాదా? ఇంకా మీ యిద్దరూ అట్లా ఏడుస్తూ కూర్చుంటే యిద్దర్నీ మూకుడులో పడేసి వేయించి కరకరా నమిలేస్తాను. ఊ! నోరు మూస్తారా లేదా?" అని ఎర్రటి కనుగుడ్లను విష్ణుచక్రాల్లా తిప్పుతూ కేక వేసేడు. పెద్దవాళ్లంతా విరగబడి నవ్వేశారు. ముఖ్యాయనుడు కూడా చిరునవ్వొకటి వదిలి "రాధా! నాకు కాసిని ఆకులు రాసిపెట్టు" అన్నాడు.

"నాకు కూడా" అన్నాడు మేనేజరు.

'రాధా' అని సంబోధింపబడ్డ కుర్రాడు, పాన్ దాన్ దగ్గర పెట్టుకుని, బాలికలాగ వయ్యారంగా కూర్చున్నాడు— తమలపాకులకు సున్నం రాయడానికి.

పానకం త్రాగేక కుర్రాళ్లంతా నిద్రపోయేరు. ముఖ్యాయనుడు చెరువులో స్నానంచేసి పూర్వపు టుంగ్రాలను చక్క దిద్దుకొని. ప్రార్థన చేసుకోవడానికి వో ప్రక్కగా కూర్చున్నాడు. మేనేజరు మాత్రం విశ్రాంతి అనేది లేకుండా వంట సంగతి అజ్మాయిషీ చెయ్యడానికి వెళ్ళేడు.

భోజనానంతరం జట్టులోని వకతను వూళ్లో విశేషాలు కనుక్కురావడానికి వెళ్లాడు. ఎట్లా తెల్సుకున్నాడో గాని అతను, తిన్నగా రాయ్ వంశీయులికి చెందిన భూలురాయ్ వద్దకు వెళ్లేడు. భూలూరాయ్ కి 24 ఏడ్లుంటాయి జమీందార్ గారబ్బాయి. సాలుకి వందరూపాయలు స్వంత ఖర్చులకని తండ్రి యిస్తుంటాడు అతనికి. అయినా అతని ఖర్చుకి ఆడబ్బు

చాలదు. ఆవూళ్లో ఎవరూ అతనిని పట్టించుకోకపోయినా, అతనా గ్రామానికి పెద్దలాగ అన్ని విషయాల్లో కలుగజేసుకుంటూ వుంటాడు.

భూలూ మొదట్లో కొంచెం చికాకు నటిస్తూ –"మీ కేం మతిపోయిందా? జనం దగ్గర తినడానికి తిండికి డబ్బులేదు. వీధినాటకాలకి చందాలు ఎక్కడ్నుంచి తెస్తారయ్యా?" అన్నాడు, వచ్చిన జట్టులోని మనిషితో.

"ప్రయత్నించి చూద్దాం. ఇవ్వకపోతే చేసేదేముంది?" అన్నాడు బృందం తరఫున వచ్చిన మనిషి.

"అయితే వెళ్ళి ప్రయత్నించండి. ఊళ్ళో బెనర్జీలున్నారు. ఇంకా ఆ ప్రక్కన చటర్జీ లున్నారు. వాళ్ళంతా మోతుబరులు, నాగరీకులూను. వాళ్ళని వెళ్లి కల్సుకోండి."

"అట్లా కోపించకండి. ఈ వూళ్ళో రాయ్ వంశీయులు చాలా కాలంనుంచి వుంటున్నారు. వారి కీర్తిప్రతిష్టలు నలుమూలలా వ్యాపించినయ్. మీరు లాభం లేదంటే వెళ్లిపోతాంగాని, మిమ్మల్ని కాదని మరొకరి వద్దకి వెళ్లము. అయినా తమరు తల్చుకుంటే చెయ్యలేని దేముంది బాబూ! ప్రభువులు కళాపోషణ చెయ్యకపోతే మరెవరు మాబోటి వాళ్ళని చూస్తారు? తమరి సాయం లేనిదే మేమేమీ చెయ్యలేం."

ఆ పొగడ్తతో భూలూరాయ్ వుబ్బిపోయేడు. "సరే! చూద్దాం. అయితే ఒకో ప్రదర్శనకి ఎంత తీసుకుంటున్నారో చెప్పండి."

"మీలాంటి వారిదగ్గర నోరువిడిచి యింత యిమ్మని మేము అడుగుతామా బాబూ! మీ దయవచ్చినంత యిప్పించండి."

భూలూరాయ్ లోపల కొంచెం లెక్కవేసి చూసుకున్నాడు. సునాయాసంగా తను 15 రూపాయలు పోగు చెయ్యగలడు. ఇంకా ఒకటో రెండో ఎక్కువేగాని అంతకు తగ్గదు. ఆ ఎక్కువొచ్చిన మొత్తం తన స్వంత ఖర్చులకి పనికి వస్తుంది. సైట్లకి, పొగాకు, తాంబూలాలకి మహా అయితే మూడురూపాయలవుతాయి. పోతే, మిగతా పన్నెండు రూపాయలు వాళ్ళకి యిచ్చెయ్యవచ్చును.

"చూడండి. పదిరూపాలు, ఓ మణుగు బియ్యం యిప్పించగల్ను. ఏమంటారు? ఇష్టమైతే మీ జట్టుని పిల్చుకు రండి. నాటకాన్ని మాత్రం 9 గంటలకల్లా ప్రారంభించెయ్యాలి," అని అనుకున్న దానికి రెండు తగ్గించి మరీ చెప్పేడు రాయ్.

"దినబత్తెమన్నా ముట్టేట్లు చూడండి. మొత్తం ముప్ఫయి యిద్దరమున్నాం. మనిషికి అర్ధరూపాయయినా గిట్టకపోతే ఎట్లా బాబూ! పదహారు అయినా యిప్పించండి."

"మీరు మరీపట్టుపడితే, యింకో రూపాయి యిప్పించగలను. అంతే. ఈ రోజుల్లో వీధి నాటకాలెవరికి కావాలి? కంపెనీ వాళ్ళొచ్చి ఆడతారిక్కడ."

కాదంటే అసలుకే చెడుతుందని 'మావాళ్ళతో ఆలోచించుకుని వచ్చి పది నిముషాల్లో చెబుతాను" అన్నాడు జట్టులోని మనిషి.

పైకి కు(రాడిలా కన్పిస్తున్నా, యిట్లాంటి విషయాల్లో చాలా అనుభవముంది భూలూారాయ్‌కి. మానవ నైజాన్ని కాచి వడపోసే డతను. వీధి నాటక ప్రదర్శనకి, యీరోజుల్లో పదకొండు రూపాయలంటే తక్కువేమీ కాదు. అంచేత అతను వెంటనే చందాలు వసూలు చెయ్యడానికి వూళ్ళోని పెద్ద మనుషుల దగ్గరకి వెళ్ళేడు.

జట్టులోని మనిషి వెళ్లి "ఎంత బేరమాడినా 11 రూపాయలు, ఏణుగు బియ్యం తప్ప మరెక్కువ వచ్చేటట్టు లేదు" అని చెప్పేడు.

"అందరికీ దినబత్తెమే 12 రూపాయలు అవుతుంది కదా, మిగతా రూపాయి నా జేబులోంచి యిమ్మంటావా" అనడిగేడు మేనేజరు.

వైలనిస్టు, వైలనుకు శృతిపెట్టుకుంటున్నాడు. "ఊరికే కూర్చుంటే బత్తెం డబ్బులు కూడా ముట్టవు. పని వచ్చిన ప్పుడు కాలదన్నుకుని వూరికే కూర్చునేకంటె, పనిచేసి ఎంత వస్తే అంత ధాబట్టుకోడం మంచిది కదా! మూడోవంతు బత్తెం యివ్వండి చాలు; ఈసారికి యింతే ప్రాప్తి అనుకుంటాం" అన్నాడు.

"సరే. ఈ విషయం మిగతా వాళ్ళతో మాట్లాడి మీారే వప్పించండి. ముల్గాయనబాబుతో మాట్లాడి నేను వప్పిస్తాను. ఎక్కడాయన — నిద్రపోతున్నాడా?" ప్రశ్నిం చేడు మేనేజరు.

ముల్గాయనుడు నిద్రపోవడంలేదు గాని, వూరికే పడు న్నాడు. ముప్ఫయి, ముప్ఫయి అయిదేళ్ల క్రితం ప్రదర్శన

లివ్వడానికి ఆయనీ గ్రామానికి వస్తుండేవాడు. తను కుర్రా డిగా వున్నప్పుడు, తన గురువు 'అధికారిగారి' జట్టులో రాధ వేషం వేస్తూడేవాడు. ప్రతీ చిన్న విషయం ఆయనకు గుర్తుకు రాసాగింది.

"నిద్రపోతున్నారా" మేనేజరు వచ్చి అడిగేడు.

ముల్లాయన బాబు కళ్ళు తెరచి చిరునవ్వుతో "ఏమిటి విశేషం?" అన్నాడు.

"ఊళ్లోవాళ్ళు పదకొండు రూపాయల కంటె ఎక్కువ యివ్వ లేరుట?"

"అయితే ఏం చేద్దాం ?"

"నేనందుకే మీ వద్దకి వచ్చేను. ఫిడేలు వాయించే అతను ఎంత వస్తే అంతతోనే తృప్తిపడదాము అంటున్నాడు. మీరూ యీనారికి స్వల్పంతోనే తృప్తిపడాల్సి వుంటుంది. కాస్త లోనే మన మంతా సర్దుకోవాలి"

"సరే, నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి."

మేనేజరు ఆయనని వదలి వెళ్లగానే, మళ్లా కళ్ళు మూసుకొని నిశ్చలంగా పరున్నాడాయన. మనస్సులో పూర్వ స్మృతులు మెదలసాగినయి.

  

పది, పన్నెండేళ్ల అందమైన కుర్రాడు అతను. ఇప్ప టికీ అద్దంలోని ఆనాటి ముఖం స్పష్టంగా గుర్తుంది. ఆ జట్టు లోకి ఎట్లా వచ్చేడో, ఎక్కడ నుంచి వచ్చేడో పక్క వృద్ధ అధికారికి మాత్రమే తెలుసు. 'అధికారి' సంరక్షణలో వుంటుండేవాడు అతను. కావలసినవన్నీ ఆయనే చూసేవాడు.

సాయంకాలాలప్పుడు చిలక్కి చెప్పినట్లు సంగీత శిక్షణకూడా యిచ్చేవాడు.

"ఓ శ్రీమతీ! నువ్వు వ్రజేశ్వరివి. వ్రజరాణివి. నీ కను కొలకుల్లో ఆ కన్నీరేమిటి? ఎందుకు?" అడిగేది బృంద.

మృధుమధుర స్వరంతో అతను జవాబు యిచ్చే వాడు. "బృందా! ప్రేమికులకీ పాట్లేమిటో, ఎందుకో నువ్వే చెప్పగలవా!"

"పాట్లా? పాట్లేమిటి! నాకు అర్ధంకాలేదు సరిగా చెప్పు."

"ఈ ప్రేమ మార్గము విచారాలతో, విరహాలతో ఎందుకు నిండి వుండాలి అని అడుగుతున్నాను బృందా!"

"విచారమా! విచార మెందుకుండాలి? ప్రేమ ఆనందంతో నిండి వుంటుందమ్మా!"

"లేదు, చెలీ లేదు. ప్రేమ బాధతో నిండి వుంటుంది" అని చెప్పి, ప్రేమగీతం ఆలాపించేవాడు..."ప్రీతి సుఖేరే, సమ్యాదేఖయా న్తైతే—"అంటూ.

రంగస్థలంమీాద అతను అనేక రకాల దుస్తులతో అవు పించేవాడు. ముఖం రకరకాల చుక్కలతో అందంగా అలంక రింపబడేది. రంగస్థలాలు మాత్రం మారేవి. కొన్ని రంగ స్థలాలు యిళ్ళముందర; మరికొన్ని దేవాలయంముందు ఆరు బయట వుండేవి. కళ్ళు జిగేల్మనే దీపాలు! ఇసక వేస్తే రాలని జనం! ఆపూరి బెనర్జీలు భక్తిరస ప్రధానమైన నాటకాలంటే, బ్రహ్మాండమైన రంగస్థలం తయారు చేసే వారు. ఎంత అద్భుతంగా వుండేది ఆ రంగస్థలం! ఎంత

అందంగా వుండేది అది చూడడానికి! అప్పటికి తనకి పన్నెండేళ్ళు మాత్రమే!

పల్లెలోని పిల్లలంతా ఎంతో కుతూహలంతో రంగులు వేసుకునే గదిలోనికి తొంగి చూసేవారు. తనతో మాట్లాడాలని ఎంతగానో విలవిల లాడిపోయేవారు. ఇప్పటి ఘోషాల్ మహాశయుడిలాగ ఆనాడు బంతంత కళ్లతో అతి రౌద్రంగా, భయానకంగా అవుపిస్తూండేవాడు హరీష్ ఘోష్. ఆయనొచ్చి పిల్లల్ని అదిలించి "ఆ పిల్లల్ని పట్టుకోండి-మింగేస్తా" అని హుంకరించేవాడు. ఎక్కడవాళ్ళక్కడ పిల్లలంతా మటు మాయమయి పోయేవారు.

తనకోసం అనేకసార్లు జనం కిళ్ళీలను స్టేజిమీదికి విసిరేవారు. తను కన్నెత్తి జనంవంక చూస్తే చాలని గిలగిల లాడిపోయేవారు. ప్రదర్శనం అయిపోగానే, మొద్దులా నిద్ర పోయేవాడు. ఆ నిద్ర నిద్ర యిక మర్నాటి మధ్యాహ్నం దాకా లేచేవాడు కాదు. రంగులు వేసే గదిలో తను పడుకుని వుంటే చెవుల్లో యింకా, వాయిద్యాల ధ్వనులు విన్పిస్తూనే వుండేవి ఓసారి కలలో తనని బృంద 'శ్రీమతి రాధా' అని పిల్చినట్లు విన్పించింది. అతను మైకంలోంచి మేల్కొన్నాడు. అతను కలగనటంలేదు. నిజంగానే ఎనిమిది, తొమ్మిదేళ్ల బాలిక ఒకతె అతనితో మాట్లాడుతూంది.

"వెళ్ళు. వెళ్ళిక్కడనుంచి. నాతో ఎవరూ సరసాలాడనక్కర్లేదు" అని అరిచేడు అతను.

ఆ అమ్మాయి కొంచెం దూరం పరుగెత్తికెళ్ళి నిలబడి, "మిమ్మల్ని పిలుస్తున్నారు" అని కేక వేసింది.

"వెళ్లు. వెళ్లు!" అని మళ్లీ కళ్లు మూసుకున్నాడు అతను.

"శ్రీమతీ! నీకోసం మా అమ్మ పంపింది నన్ను."

అతను కండ్లు తెరచి చూసేడు. "నీకోసం మా అమ్మ మిఠాయి చేసింది. పిల్చుకు రమ్మంది" అన్నది ఆ బాలిక.

ఆశాపరుడైన ఆ కుర్రాడు మిఠాయి పేరువిని నిలవ లేకపోయేడు. కొందరు మగాళ్లు అప్పుడే లేచి కాలకృత్యాలు తీర్చుకోడానికి వెళ్ళేరు. మరి కొందరు యింకా నిద్రపోతూనే వున్నారు. అతను లేచి ఆ బాలికను అనుసరించేడు. వంకర టింకరగా వున్న పల్లెటూరి రోడ్డది. రోడ్డుమీాద జనం అక్కడక్కడ ఆవులిస్తూ వున్నారు.

"రాత్రి నాటకంలో రాధిక వేషం వేసిన అబ్బాయి ఇతనే అనుకుంటా-ఇతనేనా?" అని అడిగేడు ఓ పెద్దమనిషి.

"అవును. ఇతనే! ఇప్పుడు మాయింటికి వస్తున్నాడు." ఆ అమ్మాయి గర్వంగా జవాబు చెప్పింది.

"మీాకేమైనా బంధువా?"

"అవును."

ఆ అబ్బాయి తబ్బిబ్బయ్యేడుగాని, కాదని చెప్పడానికి అతనికి అవకాశం లేకపోయింది. ఆ అమ్మాయి వంకర టింకర రోడ్లమీాద తిప్పితిప్పి, చుట్టూ చెట్లతో గుబురుగా కప్పుకుని వున్న ఓ చిన్న యింటిలోకి తీసుకుని వెళ్లింది ఆఖరికి. పాతికేళ్ళ యువతి ఒకర్తె, మందహాసం చేస్తూ, "రా, గోపాల్ లోపలికి,రా తిన్నగా! నీ కోసమే ఎదురుచూస్తున్నా" అన్నది.

"ఇతను గోపాలుడుకాదే అమ్మా! ఇతను శ్రీమతి రాధ" అని, నటుల స్వరవాద్దికలతో, నటులని అనుకరిస్తూ పలికింది ఆ అమ్మాయి చిర్నవ్వుతో.

"కొంటె కోణంగీ!" అని కోప్పడింది ఆ అమ్మాయి తల్లి.

ఆ అమ్మాయి పకపకమని నవ్వేస్తూ పరుగెత్తుకు పోయింది.

ఆ అమ్మాయి తల్లి, అతనికి కూర్చోడానికి వుచితాసనం చూపుతూ, "నువ్వు నిద్రపోతూన్నట్లున్నావు. ఇంకా ముఖ ప్రక్షాళనం చెయ్యలేదు కదూ?" అంటూనే కచిక-తాటాకుముక్క, చెంబుతో నీళ్ళు అందించింది. అందించి, "గోపాల్! మేం వైష్ణవులం. మా యింట్లో భోజనం చెయ్యడానికి నీకు అభ్యంతరం వుండదుకదా?" అడిగింది.

"నేనూ వైష్ణవుడినే." ఆ కుర్రాడు సమాధానమిచ్చేడు. ఆమె ముఖం సంతోషంతో వికసించింది 'అంతే అయ్యుండాలి.' అనుకుందామె. అతను వైష్ణవుడు కాకపోతే అంత స్వచ్ఛంగా రాధని అనుకరించ లేడు. వైష్ణవుడే అయ్యుండాలి. "కొద్దిగా ఏమైనా తింటావు కదూ! ఊఁ తిను."

వెన్నముద్దలు నాలుగయిదు పెట్టింది ఆవిడ. ఎంతో రుచికరంగా వున్నాయి అవి! మరికొంచెం కావాలని అడగటానికి మొహమాట పడ్డాడు అతను. అతను త్వరగా కాసిని మంచినీళ్ళు త్రాగి, చేతులు కడుక్కుని, వెళ్ళడానికి లేచేడు.

"పాటొకటి విన్పిస్తావా, నాయనా!"

"ఏపాట పాడను?"

"శ్యామ సుఖ పాహి—విన్పించు బాబూ!"

చిన్న రాగం ఆలాపించి ఆపాట పాడేడు అతను. ఆవిడ తన్మయత్వంతో ఆపాట విని, మరోపాట అన్నది. మరో పాట పాడితేనేగాని అతనిని వాళ్ళు వదల్లేదు.

దారిలో అతనిని ఆపిన మనుష్యులింకా స్పష్టంగా గుర్తున్నారు. వాళ్ళంతా యువకులు. పెద్దమనుష్యులు. "ఇట్లారా, బాబూ! మేం చెప్పేది విను" అన్నారు, వెళ్తూన్న అతనిని ఆపి. అతను ఆగేడు.

"నీ పేరేమిటి?"

చెప్పలేని భయంతో అతని గొంతు పూడిపోయింది. 'అయ్యా—' అని మాత్రం అనగల్గేడు.

"నీ పేరేమిటి బాబూ!"

"నాపేరా? నాపేరు గౌర్ దాసండి."

"మీ యిల్లెక్కడ?"

"నాకెవ్వరూ లేరండి. అంచేత 'అధికారి' దగ్గరే వుంటూంటాను."

"ప్రదర్శనకి యింత అని ఏమైనా నీకు డబ్బిస్తూంటారా, లేకపోతే అన్నవస్త్రాదులు మాత్రమేనా ?"

అతను మౌనంగా వూరుకున్నాడు. అందులో ఒకళ్ళు అన్నారు "మాకో నాటక కంపెనీ వుంది. నువ్వు మాతో కలిస్తే నీకు జీతం యిస్తాం. నీకెవ్వరూ బంధువులు లేరంటున్నావు. నీకు వుండటానికి ఓయిల్లు కూడా యిస్తాం. తెల్సిందా?"

"నేను రాలేను" అన్నాడు అతను. కంపెనీ నాటకాల కంటె, వీధి నాటకాల జట్టంటేనే అతనికి అమిత యిష్టం. కంపెనీ నాటకాల్లో రాధ నృత్యం చేస్తుంది. పైగా–రాధ అంటే బృందకి ఏమాత్రం గౌరవంలేదు.

"ఎందుకు రాలేవు?"

ఈసారి అతను భయంతో ఏడ్వసాగేడు. వాళ్లింక అతన్నేమీ బాధించలేదు. వాళ్లు నవ్వుకొని అతన్ని వది లేసేరు. అతను తిరిగి రంగస్థల ప్రదేశానికి వచ్చేసరికి ఆ బాలిక తనకోసం ఎదురుచూస్తూ వుంది. "శ్రీమతి!" అని కిల కిల మన్నది.

ఈ పర్యాయం అతనికీ నవ్వు వచ్చేసింది. నవ్వేసేడు.

"అమ్మ నీకోసం పంపించింది" అని చెప్పింది ఆ అమ్మాయి.

ఆ తర్వాత ప్రతీ ఏడూ తమ జట్టుని రథయాత్ర వుత్స వానికి ఆవూరు పిల్పించేవాళ్లు. ఏటేటా ఆ జట్టుతో అతనూ ఆ వూరొచ్చేవాడు. పిలుపుకోసం ఎదురుచూడకుండా, అతను తిన్నగా ఆ చిన్న యింటికి వెళ్లి "అమ్మా" అని పిల్చేవాడు.

"ఎవరది ? నా గౌర్ దాస్ గోపాలుడేనా ? రా నాయనా, లోపలికి రా. నీకోసం లడ్డుండలు తయారుచే స్తున్నా. గోపాలుడికి వెన్నముద్దలన్నా, లడ్డూగడలన్నా అమిత యిష్టం! అవునా?" అనేదామె.

"గోపాలుడు పసిపాప–పాపం, ఏదీ పాకు చూద్దాం... పాపాయి పాకు...పాకు" అని గోలచేసేది ఆ అమ్మాయి.

"పట్టుకున్నానంటే చితకగొట్టేస్తా రాధా!" అనేవా అతను కోపం నటిస్తూ. ఆ అమ్మాయి పేరు రాధారాణి!

తొమ్మిదేళ్ల అమ్మాయి అల్లా - పదేళ్ళు, పదకొండేళ్ళు, పన్నెండేళ్ల పిల్లగా ఎదిగింది కాలంతో ఆ అమ్మాయి గౌర్ వైపు వీపు త్రిప్పి కూర్చుంది యీసారి.

గౌర్ చిలిపిగా అన్నాడు, "మీ అమ్మగార్ని చూడ ఎంత కోపంగా వున్నారో!"

రాధ నాటకంలో అతని భాగాన్ని అప్పగిస్తూ అన్నది "ఆ మొహాన్ని—ఆ అందమైన నల్లటి మొహాన్ని - యిక ఎన్నడూ కన్నెత్తి చూడను. అతను గుర్తుకువస్తాడని నల్లటి యమునానదీ జలాల వైపు కూడా పోను. నా నల్లటి కురులు అతన్ని జ్ఞాపకం చేయకుండా - వాటిని కూడా తీసివేస్తా. నా నీలాంబర వర్ణం చీరని కూడా ఎన్నడూ ధరించను. పసుపు పచ్చటి చీర కొనుక్కుని యోగినిలా వుంటాను!"

ఆమె తల్లి నవ్వింది. "ఇట్లాగే విసిగించి ఎప్పుడో నా ప్రాణాలు కాస్తా తోడేస్తావు. గౌర్ దాస్ రంగస్థలం పైన అట్లాగే మాట్లాడుతాడా? ఆ స్వరం అట్లానే వుంటుందా? ఆ మృదుమధురస్వరం జన్మలో నువ్వు అనుకరించగలవూ?"

"ఓ! అంతకంటె బాగా అనుకరిస్తా."

"ఆఁ, దయచెయ్యి. నన్నాట్టే విసింగిచకు" అనగానే, ఆ అమ్మాయి వెళ్ళి పోయింది?

తల్లి అన్నది. "గోపాల్, నువ్వు పెద్దవాడి వవుతున్నావు. నువ్వు నీ స్వంత జట్టును పెట్టుకునే సమయం వస్తోంది. నువ్వింకేదైనా పెద్ద జట్టులో చేరితే ఎక్కువ

డబ్బు వచ్చే అవకాశం కూడా వుందని రాధ తండ్రి చెబుతున్నారు. నీకు వచ్చే నష్టం కూడా ఏమీ వుండదుచూడు."

"అధికారిగారు నాకో యిల్లూ, పొలం కొనిపెడతానని నాతో చెప్పేరండి" అన్నాడు గార్.

"మా రాధని పెళ్ళాడి, మా అల్లుడివి వవ్వాలని కోరికగా వుందయ్యా ! అల్లాజరితే నేనెంతగా సంతోషిస్తానో చెప్పలేను."

గార్ సిగ్గుతో తల వంచుకున్నాడు, ఏమీ మాట్లాడలేక పోయేడు. రాధారాణి పెద్ద అందకత్తె ఏమీ కాదు గాని, ముఖంలో వర్చస్సు వుంది. మనిషి శలాకలాగ వుంటుంది. చలాకిగా ఏపని చెప్పినా చేసుకునిపోతుంది. మనిషి మాట్లాడుతూన్నంతసేపూ కళ్లు మాత్రం అస్థిమితంగా అటు యిటు నృత్యం చేస్తూంటాయి- ఎక్కడా నిలబడవు.

గార్ సిగ్గుతో మాట్లాడకపోవడం గమనించి, అర్ధాంగీకారమని తలచిన రాధారాణి తల్లి సంతసానికి మేరలేక పోయింది. చిర్నవ్వుతో ఆమె అన్నది: "నేనూ, రాధ తండ్రీ, యీ విషయం గురించి చాలాసార్లు అనుకున్నాము. ఆయనకి కూడా యీ సంబంధం అంటే చాలా యిష్టం. ఆయనేమన్నారో తెల్సా? "గార్ రాధ పాత్ర ధరిస్తాడు, రాధేమో మూర్తీభవించిన రాధే! ఈ యిద్దరూ చిలకాగోరింకల్లా వుంటారు!" అన్నారు. "ఆయనే వెళ్ళి అధికారిగారితో అన్నీ మాట్లాడుతారు."

గార్ చాలాసేపు మౌనంగా వుండిపోయేడు. పూర్వంవలె మారు వడ్డించమని అడగలేకపోయేడు. గార్ అడగలేక

పోయినా, మళ్ళా రెండు, మూడు వెన్నముద్దలు వడ్డించింది రాధారాణీ తల్లి. "ఇంకా అల్లుడు కాకుండానే, గోపాలుడి మొహమాటం చూడమ్మా" అంటూనే నవ్వింది ఆవిడ.

తిరిగి వచ్చేస్తూండగా, దారిలో వంటరిగా తారస పడ్డది రాధారాణి. గాధ రోడ్డు వైపుకు ఓ ప్రక్కగా జరిగి, గోపాలుడి వైపు వీపు త్రిప్పుకుంది.

"ఏమిటది గర్వమా ? లేకపోతే కోపమా?" అని హేళన చేసేడు గౌర్.

రాధ సిగ్గుతో పక్కకు తిరిగింది. "ఏమిటా మాటలు?" అంటూనే కిలా కిలా నవ్వేసి, "నేనంతా విన్నాను!" అన్నది త్వరగా నడుస్తూ.

గౌర్ హృదయం ఆనందంతో నిండి పోయింది.

అతనా రోజంతా రాధారాణి తండ్రి కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. అతని మనస్సు మరి దేనిపైనా లగ్నం కాకుండా వుంది. ఆ వూళ్లో అతనితో పరిచయమున్న కుర్రాళ్ళు, తమలపాకులు, సిగరెట్లు, పట్టుకుని పరుగెత్తుకుని వచ్చేరు. కాని, అవ్వేళ వాళ్ళతో గడపటమంటేనే అతనికి విసుగేసింది.

రాధతండ్రి వచ్చేసరికి దాదాపు సాయంత్ర మయ్యింది. ఆయన అధికారి గారికి వందనం చేసి, "మిమ్మల్ని ఓ కోరిక కోరడానికి వచ్చేను" అన్నాడు.

కంపెనీ మేనేజర్, రాధాకృష్ణులతో, అధికారిగారు చిన్న గదిలో వుంటున్నారు. ఆయనకి ప్రత్యేకమైన పడక, మిగతావన్నీ ఏర్పాట్లు కూడా ప్రత్యేకమైనవే! ఆయన ఏతేం

చిన అతిథిని గమనించి, ప్రత్యభివందనం చేసి "కూర్చోండి. ఆ! చెప్పండి. నేను చేయగల్గినది ఏముందో చూద్దాం" అన్నాడు. వెనక గదిలో నిలబడ్డ గౌర్ దాస్ మూసివున్న కిటికీకి చెవి ఆన్చి ఆతుర్దాగా వినసాగేడు. అవసరమైతే కిటికీ మధ్యనున్న చిన్న కంతలోంచి అతను చూడగలడు కూడాను.

చేతులు జోడించి, దరహాస వదనంతో తన కోరిక వెలిబుచ్చి, "గౌర్‌కి తల్లయినా తండ్రయినా మీరే గనుక, మీ అనుమతి కోసం ఎదురు చూస్తున్నాం" అని చెప్పేడు.

"మీ ఉద్దేశం చాలా బాగుంది" అని కొంచెం ఆలోచించి మళ్ళీ అన్నాడు: "కాని గౌర్ యింకా పసివాడు. వాడు యింకా నాట్యశాస్త్రాన్ని బాగా అభ్యసించాలి. స్వరానికి, సంగీతానికి సాధన అత్యావసరం కదా! శిక్షణ లేందే విద్య రాణించదు."

"మా అమ్మాయికి కూడా పెద్ద వయస్సేమీ కాదు. సరిగ్గా పన్నెండేళ్ళు లేవు. కొన్నాళ్లు ఆగడమే మీ అభిమతం అయితే, అట్లాగే ఆగుదాం."

హఠాత్తుగా అధికారి మేనేజరు వైపు తిరిగి, "కొంచెం సేపు మా యిద్దర్నీ ఒంటరిగా వదల్తారా?" అన్నాడు. "వెళ్ళేప్పుడు గది తలుపు దగ్గరగా వేసి వెళ్ళండి, చాలు."

మేనేజర్ వెళ్ళగానే ఆయన అన్నారు: "తమరు వైష్ణవులు. నేను బ్రాహ్మణుడిని. వృత్తివల్ల నేను దైవనిర్మితమైన అనేక కులాలతో తిరగవలసిన అవసరం గలవాడిని. అయినా మీరో సంగతి తెల్సుకోనడం చాలా అవసరం..." అంటూ నేలపై దృక్కులను సారిస్తూ ఆగిపోయేడు. రాధ

తండ్రికూడ అధికారి మొహంవైపే చూస్తూ మౌనంగా వుండి పోయేడు. కాస్సేపయిన తర్వాత ఆతృత పట్టలేక, నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, "ఊ! చెప్పండి" అన్నాడు.

"ఈ విషయం మీకు ఎట్లా చెప్పాలో తెలియడం లేదు. ఈ విషయం చాలా రోజుల్నుంచి అట్లానే వుండి పోయింది. ఎన్నటికీ దీని అవసరం వస్తుందని నే నూహించ లేదు. కాని యీ నాడు మీరు మీకోరికను వెలిబుచ్చే సరికి నేను తప్పని సరిగా చెప్పవలసి వస్తోంది." పెద్ద నిట్టూర్పును విడచి అన్నాడాయన: "ఆ కుర్రాడు వైష్ణవుడు కాదు!"

"వైష్ణవుడు కాదా? అయితే ఎవరు?" ఆశ్చర్యంతో ప్రశ్నించలేక, అడగ గల్గేడు రాధ తండ్రి.

"అంతా అతన్ని వైష్ణవుడనే అనుకుంటూంటారు. ఆ వుద్దేశం కూడా నేను కల్పించినదే. బర్ద్వాన్ నుంచి వస్తూండగా, ఆరేళ్ళ వయస్సున్న ఆ కుర్రాడు దొరికేడు. ఆ కుర్రాడి ఆకార, స్వరూపాలు చూసి నేను ఆకర్షింప బడ్డాను. అతను పాటలు పాడుకుంటూ ముష్టెత్తుకుంటు న్నాడు. అతన్ని చూసీ చూడంగానే నా జట్టులో జేర్చుకో వాలనుకున్నాను. అక్కడ దుకాణదార్లు చెప్పేరు—అతని తల్లి—" అధికారి గొంతులోంచి మాట పెగల్లేదు

"ఊఁ. అతని తల్లి—?" కుతూహలంతో అడిగేడు రాధ తండ్రి.

"ఏం చెప్పను? అవును. అతని తల్లి—ఓ దేవదాసి అని చెప్పేరు"

"వేశ్యా?"

"అవును. వేశ్య అనే చెప్పేరు."

కిటికీని ఆనుకుని వింటూన్న గౌర్‌కు వళ్లు పట్టు తప్పి పోతున్నట్లనిపించింది. ఆకస్మికంగా అతని తల తిరిగిపోసాగింది. హృదయంపైన ఎవరో సుత్తితో బలంగా కొడుతూన్నట్లని పించింది.

రాధ తండ్రి స్తబ్దుగా కూర్చుండి పోయేడు. అధికారి చెప్పసాగేడు; "ఆ కుర్రాడ్ని దగ్గరకి చేరతీసినప్పుడు నా స్వార్థమే పనిచేసింది. కాని, యిప్పుడా కుర్రాడంటే నాకు ప్రాణంతో సమానం. అతను నాతోనే తింటూ, నేను చెప్పి నట్లు వింటూ అప్పటినుంచీ నా కుమారుడిలా పెరిగేడు. రాధా, కృష్ణుల భక్తి నాటకాల్లో రాధవేషం ధరిస్తున్నాడు అప్పటినుంచీ. ఈ విధంగానైనా అతని పూర్వీకుల పాపం నశిస్తుందేమోనని ఆశించేను. అతనికి యింకా జ్ఞానం వచ్చేక, అతన్ని వైష్ణవ మతంలోకి మార్చాలని వుద్దేశించేను చైతన్య మహాప్రభువు ప్రబోధాల్లో కుల మత వివక్షత పనికిరాదని కదా సెలవిచ్చేరు. భక్తులంతా ఒకటే అన్నారు పైగా యిన్నికోట్ల జీవరాసుల్లో—"

"ఉహు. వద్దు, వద్దు. అది అసంభవం. మేము జన్మతః వైష్ణవులం. మతం మార్చుకున్న వాళ్ళం కాదు" అని తీవ్రంగా తల వూగించి, వెంటనే అధికారి పాదాల్ని స్పృశిస్తూ, "మీవంటి న్యాయవర్తనుల్ని నేనెక్కడా చూడలేదు, ఈవేళ మీరు నన్ను మతభ్రష్టుణ్ని కాకుండా రక్షించేరు" అని చెప్పి కళ్ళనుండి అశ్రువులు కార్చేడు, రాధ తండ్రి.

ఆసంఘటనతో గౌర్ కి ప్రపంచముతో నిమిత్తం లేకుండాపోయింది. అతని మెదడు శూన్యమై పోయినట్లయ్యింది. లోపల్నుంచి ఏదో తెలియని బాధ నమిలివేయసాగింది. సర్వదా అతని కళ్లు నీళ్లతో నిండివుండేవి. ఎన్నిసార్లు వాటిని తుడుచుకున్నా, మళ్లీ కళ్లనుంచి నీరు ధారగా ప్రవహిస్తూం డేది. తన తల్లి! బిగ్గరగా వెక్కి వెక్కి ఏడ్వసాగేడతను. ఎవ్వరూ తనని గమనించకుండా, రోడ్డుమీద త్వరగా నడుచు కుంటూ వెళ్లి, వూరు చివరనున్న ఆరుబయల్లో కూర్చుని హృదయం బ్రద్దలయేలాగ దుఃఖించేడతను. ఆకన్నీటికి యిక అంతు లేదనుపించింది. తన తల్లి-ఎంత దారుణమైన మచ్చ! తను రాధారాణికి అస్పృశ్యుడయిపోయేడు.

దూరంగా మాయమయ్యే సూర్యకిరణాల వింతవెలుగు తెల్లటి మంచులాగ ఆకాశంలోకి ఎగదన్నుతోంది. అంతకు మునుపు చూచాయగా అవుపించే గ్రామచ్ఛాయలు కమ్ము కొస్తూన్న చీకట్లో అంతర్ధానమయి పోయేయి. మైదానంలో వంటరిగావున్న అతను, చుట్టూ చీకటి కమ్ముకు రావడం గ్రహించి, దీర్ఘమైన నిట్టూర్పు వకటి వదలి, లేచి రోడ్డు వెం బడే నడవసాగేడు.

కాని, రాధ ఏంచేస్తుందో? బహుశా ఆమె కూడా దుఃఖిస్తూ వుండివుంటుంది. మళ్లీ అశ్రువులు కనుగొలకుల్లోంచి జలజలా రాలేయి.

ఆ తర్వాత?...అతను అనేక మార్గాలు పట్టేడు. వివిధ ప్రదేశాలు చూసేడు. రకరకాల జట్టులతో కలసి నాటకా లాడేడు. పేరు కూడా మార్చుకున్నాడు. చివరకు తన స్వంత

జట్టును ఏర్పాటుచేసుకున్నాడు. రాధాకృష్ణుల గాధయందుండే ప్రేమ అతన్ని కంపెనీ నాటకాల్లో జేరనివ్వలేదు. అందులో రాధచేత పాటలు పాడించి, నృత్యాలు చేయిస్తారు. అంత అపచారం మరోటి వుండబోదు. రాధది కోమలహృదయం. రాధలో భక్తి వుంది. అభిమానముంది. ఆమె రాజకుమార్తె. నీల వర్ణుడికి తన హృదయాన్నిచ్చినంత మాత్రాన వేశ్యలాగ ఎట్లా తైతక్కలాడగలదు? ఎంత గాఢమైన ప్రేమ అది! ఆ విరహం మాత్రం ఎంత బాధతో కూడుకుని వుంది! బంగారాన్ని కంచుతో కలపడం సాధ్యమయే పనా! రాధా— రాధా రాణి—రాధా !

కోమలమైన బాలిక సుందరవదనం అతని కళ్ల ముందు మెదిలింది. ఆ అమ్మాయి 'ఆ మొహాన్ని మరి చూడనిక ... నీలాంబర వర్ణంగల చీరనూ ధరించను. నాకో పసుపు పచ్చని చీర తెచ్చిపెడితే యోగినిలా దాన్నే ధరిస్తాను' అని అంటు న్నట్లు అన్పించింది. కాని, ఆమె స్వరం పూర్వం లాగా లేదు. గద్గదికంగా వుంది.

♦ ♦ ♦

జట్టులోని వాళ్ళంతా లేచేరు. కొందరు దుస్తులు తీసుకుని గ్రామం వైపు నడుస్తున్నారు.

'ముల్లాయనుడు దుఃఖిస్తున్నట్లున్నాడు ఆయన నిద్రలో కూడా యిష్టదేవతా ప్రార్థన చేస్తున్నాడా?" అన్నాడు శశి రహస్యంగా, మేనేజరు ఘోషాల్‌తో.

"అవును. ఆయన నిద్రలో కూడా ప్రార్థించుకుంటూన్నారు" అని సమాధాన మిచ్చి, "కానివ్వండి. త్వరగా

సర్దండి. ఊళ్లోకి వెళ్ళాలి. ఊళ్ళో అంతా పెద్ద మనుషులు. వెర్రి వెర్రి వేషాలు వెయ్యక తిన్నగా నడవండి" అని జట్టును హెచ్చరించి, నెమ్మదిగా ముల్గాయనుడిని సమీపించి, "ముల్గాయనబాబూ! మీ ప్రార్థన అయిపోయినట్లుంది. నిద్ర లోనే ఎట్లా పూర్తి చెయ్యకల్గేరు బాబూ!" అన్నాడు.

ముల్గాయనుడు కళ్ళు తుడుచుకొని, సమాధానమి చ్చేడు 'మనయిచ్ఛ లేకుండానే దేవతలు మన హృదయంలోకి వస్తూంటే, ప్రార్థించక చేసేదేముంది?"

"అంతా బయల్దేరి వెళ్ళేరు. మనం కూడా బయలుదే రితే. బాగుంటుందిక" అన్నాడు మేనేజర్.

భూలూరాయ్, ఊరివారూ కలసి రంగస్థ న్ని చక్క గా అలంకరించేరు. ఎక్కడ్నుంచో నాలుగు పెద్ద పెట్రోమేక్స్ దీపాలు తీసుకొచ్చి నాలుగుమూలలా కట్టేరు. చిన్న పిల్లలం దరికీ ముందుగా నేలపైన, వాళ్ళ వెనుకే పెద్దమనుష్యులకి బల్లలు వేసి కూర్చునే ఏర్పాటు చేసేరు. మరో ప్రక్కగా ఆడవారికీ, అందరికీ వెనుకగా వూళ్ళో జనసామాన్యానికి ఏర్పాట్లు చేసేరు.

వియోగం తర్వాత. రాధాకృష్ణుల పునస్సమాగమం ఆనాటి నాటక ప్రదర్శన గాథ. ప్రేమ మూర్తి రాధ, ద్వార కకు వెళ్లడానికి దగ్గర త్రోవకోసం అన్వేషిస్తోంది.

ఈసమయాన ముల్గాయనుడు రంగస్థలం మీదకు వచ్చేడు. చక్కగా దువ్వబడిన విగ్గును ధరించేడు. ముక్కుకి, చెవులకి, చేతులకి, కాళ్ళకి, మెడకి అందమయిన ఆభరణా లున్నాయి. తళతళ లాడే పట్టుచీర ధరించేడు. మొహం

చందన రేఖలతో తీర్చి దిద్దబడింది. దూతిక వేషంలో ఆయన రంగస్థలంపైన ప్రత్యక్ష మయ్యేడు. సేవకు డొకడు పళ్ళెరంలో తాంబూలంతో ఆయన వెనకేవచ్చి, అక్కడి నటులలో ఒకరికి వప్పగించేడు. వినమిత శిరస్కుడై మోకరిల్లి, అందరికీ అభివందనం చేస్తూ ప్రేక్షకులలోకి చూసేడు. జనం చాలామంది ఆదుర్దాగా కూర్చుని వున్నారు. కాని, రాధా రాణి ఎక్కడ? మళ్ళీ పరిశీలనగా చూసేడు—ఎక్కడ ఆమె!

"ప్రేక్షకులు యిప్పటికే వెర్రెత్తిపోతున్నారు. మీరు పాట ప్రారంభిస్తే యిక చెప్పనక్కరలేదు. ఇక లేచి ప్రారంభించండి" అన్నాడు వెనుకనుంచి లో స్వరంతో స్టేజి మేనేజర్ ఘోషాల్. ఆయన లేచి చిన్నరాగంతో పాట నెత్తుకున్నాడు. ఆయన మృదుమధుర గానంతో ప్రేక్షకులు ఎక్కడికో లేచిపోతున్నట్లు అనుభూతి పొందసాగేరు.

తెల్లారేక రావలసినదేదో తీసుకుని, ఆయన తన మకాముకు రాధ వేషం వేసిన కుర్రాడితో బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళేక గాని ఆయన గ్రహించలేక పోయేడు తనేమార్గాన వెళ్తున్నదీ! గుబురుగా చెట్లతో అల్లుకున్న యింటికి వెళ్ళే మార్గం యిది. అవునదే. కాని, ఆ యిల్లేది? బహుశా అదీ అక్కడే వుండొచ్చు. ఇల్లు ఏమాత్రం కన్పించకుండా చెట్లు ఎంత పొడుగ్గా, దట్టంగా పెరిగిపోయేయి! ఇంచుమించు చిన్న అడివిలా వుంది ఆ ప్రాంతం అంతా.

గురువుగారి కండ్లలోని పరిశీలనా దృక్కులను గమనించిన శిష్యుడు, "ఆగిపోయారేం" అని ప్రశ్నించకుండా వుండలేకపోయేడు.

ముల్లాయనుడు కొంచెం తడబడి, "మంచినీళ్ళు ఏమైనా కావాలా?" అని ప్రశ్నించేడు.

"లేదండి. నాకు దాహంగా లేదు" అన్నాడు.

అయినా ముల్లాయనుడు చెట్ల సందులోంచి చూడ కండా వూరుకోలేదు. చెట్ల వెనక వుండే పాకలు జీర్ణమై, శిథిలావస్థలో వున్నాయి. అక్కడ ఎవరూ లేరు. ఆ చెట్ల వెనక చిమ్మచీకటిలో స్పష్టంగా చూడటం అసాధ్యం కూడాను. ఆ ప్రదేశమంతా కుళ్ళిపోయిన ఆకులతో, చెమ్మతో దుర్గంధపూరితమై వుంది. చిన్న నిట్టూర్పు విడిచి కదిలేడు అక్కడనుంచి. లేదు, రాధ అక్కడ లేదు. ఆయన హృదయం భరించరాని విచారంతో నిండిపోయింది. చిరపరి చితమైన కాలిబాటలో త్వరితంగా ముందుకు నడిచేడు. వెంటనే వేదనతో ఆగిపోయేడు. ఇంత యిరుకైన బాటలో నడవటం అట్టే మంచిపనికాదు. ఆ సన్నటి మార్గంలో, సన్నటి, పొడుగైన యువతొకామె ధైర్యంగా ముందుకు నడచివస్తోంది.

ఆయనని చూడగానే ఆమె మొహం మీాదికి కొంగు లాక్కుని, వీపును ఆయనవైపు త్రిప్పింది. ఆమె మొహంలో చికాకు ప్రతిబింబిస్తూంది. ముల్లాయనుడు విస్తుపోయేడు. ఆమెకి తగలకండా జాగ్రత్తగా దాటి ముందుకు వెళ్తూండగా, పూర్వం–చాలాకాలం క్రితం సరిగ్గా యిదే స్థలంలో సిగ్గుపడ్డ రాధ తనని చూడకండా తొలగిపోయిందని జ్ఞప్తి వచ్చింది.

ఈ చిత్రమైన పునస్సమావేశాన్ని యిద్దరూ గుర్తించ లేక పోయేరు. ఈసారికూడా ప్రక్కకి తొలగి నిలబడ్డ వ్యక్తి రాధేనని ఆయనా గుర్తించ లేక పోయేడు. అలవి కాకుండా పెరిగిపోయిన వృక్షాల వేళ్లు ఆమె గృహాన్ని నాశనం చెయ్యగా, వాళ్ల వాళ్లు కొంచెందూరంగా మరో యిల్లు కట్టుకున్నారు. ఆవిడిప్పుడు గృహస్థు. పిల్లల తల్లి. ఆమె రాత్రల్లా నాటకం చూడటంవల్ల అలసిపోయివుంది. ఆవిడిని బాధించే మరో విషయం కూడావుంది. రాత్రి నాటకంలో తనుచూచిన రాధలాగే నటించిన, రాధ వేషం వేసిన కుర్రాడ్ని తను చిన్నప్పుడు ఎరిగివుండటం గుర్తుకు వచ్చింది. ఇద్దరూ ఒకేలా వున్నట్లు ఆవిడకు అన్పించింది. ఆవిడ మనస్సు పూర్వస్మృతులతో బరువెక్కి పోసాగింది. .....

ఎదురుగా నిర్మానుష్యమైన రోడ్డు. స్మృతులతో మిగిలిపోయిన శిధిల గృహాన్ని వెనకే వదిలేసి రోడ్డు ఎక్కేడు శిష్యుడితో ముల్గాయనుడు. కాని ఎవరో ఆయన్ని వెనకకు లాగుతున్నట్లే వుంది. ఆయన హృదయంలో ఏదో కలుక్కుమంది. మళ్లా రాధ అక్కడ లేదు. నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ నడవసాగేడాయన. కుర్రాడు వచ్చి కలవగానే వాడిని కాస్త ముందుకు నెట్టి, "నడు, రాధా!" అన్నాడు.

రాధారాణి, రాధ అక్కడ లేకపోవచ్చు. కాని శాశ్వతమైన—అజరామరమైన రాధారాణి వుంది అక్కడ.

మరి కాస్సేపటికి నాటకాల జట్టు ఆ గ్రామాన్ని వదలి రోడ్డు ఎక్కేరు.

బండీలో పెట్లిపైన ముల్లాయనుడూ, ఆయన ప్రక్కనే రాధా-కృష్ణులు కూర్చునివున్నారు. బండీ గ్రామాన్ని వదిలి రోడ్డు పట్టింది. పిల్ల లంతా దానివైపు విచార దృక్కులు బరపేసు. ఆడవాళ్లు ముసుగుల సందులలోంచి తొంగిచూసేరు. పెద్దవాళ్ళు కూడా ఆ రోజు ఏ పని చెయ్యలేక పోయేరు. ఆకస్మికంగా ఆగిపోయిన వాగ్వివాదాన్ని మళ్లా రాయ్ వంశీకులు ప్రారంభించేరు వుదయాన్నే.

వైష్ణవుల కుమార్తె రాధ, చెరువునుంచి తిరిగి రాగానే ఏదో నొప్పి వచ్చినట్లు పెద్దగా దుఃఖించసాగింది. ఆమె చెవుల్లో యింకా సంగీతం ప్రతిధ్వనిస్తూనే వుంది. రాధ "లేదు-ప్రియా, లేదు—" అనే సుందర దృశ్యాలు ఆమె కండ్లముందు తిరుగుతున్నాయి.

కాని ఆమె కళ్లు తెరిచేసరికి అక్కడ ఎవ్వరూ లేరు.

# ప రి త్య క్త

సాయంకాలపు బండిలో బయలుదేరి వస్తున్నానని తండ్రిగారి వద్దనుంచి జాబు వచ్చింది. ఇన్నాళ్ళనుంచి వంటరిగా వుంటూ, బ్రహ్మచర్యాన్ని నిష్ఠతో పాటిస్తున్న సతీశుడికి —ఆ కొంపను సనాతన హిందూవాసయోగ్యంగా మార్చడము బహు కష్టమై పోయింది. తీరా స్టేషనుకు వెళ్ళేసరికి, తండ్రి వచ్చిన జాడే కనపడలేదు. బహుశా బండి తప్పిపోయి వుండవచ్చని వూహించుకుని, తండ్రిగారికొరకు "హిందూ బ్రాహ్మణ భోజనశాల" నుంచి తెప్పించిన పదార్థాలను మూతపెట్టించి, అలసిపోయిన సతీశుడు నిద్రపోయేడు.

తెల్లవారుఝాము బండికి హాజరవ్వాలంటే, యింకా చీకటి వుండగానే లేచి స్టేషనుకు వెళ్ళాలి. అత్యంత పితృ ప్రేమ ప్రదర్శనము అతని సోమరి శరీరానికి సరిపడని విషయమవటంవల్ల సతీశుడు తన సేవకుణ్ణి వుదయాన్నే స్టేషనుకు పంపించేడు. వెళ్ళబోయేముందు వాడిచేత సుమారు యాభై సార్లన్నా జనకుడి నామాన్ని వుచ్ఛరింపజేసేడు. వాడి చెవులు పట్టుకుని, జనకుని ఆకారాన్ని, వర్ణనలతో, కండ్లముందు అగుపించేట్లు చిత్రించేడు కూడాను.

"రవినాశబాబు కాదు, అవినాశబాబు. గుర్తుంటుందా? ఏదీ, పాడు ఓ పాతికసార్లు."

"చిత్తం హుజూర్. అవినాశబాబు...అవినాశబాబు.. అవినాశ..."

"యింకో పాతికసార్లు...కానీయి."

"చిత్తం...అవినాశబాబు...అవినాశ..."

"అద్దదీ. రైటో...యికపో."

ప్రొద్దెక్కాక లేచేడు సతీశుడు. నాన్నగారు తనను గురించి ఏమనుకుంటున్నారో? త్రుళ్ళిపడి లేచేడు ప్రక్క మీదనుంచి సతీశుడు—నాన్నగారికోసం నలుదిశల చూస్తూ.

చేటంత ముఖాన్ని చేసుకొని! సేవకుడు వంగి సలాము చేసేడు. "బాబుగారు వచ్చేరు హుజూర్!"

కనుచూపు మేరలో తండ్రిగారు అగుపించక పోవడం వల్ల సతీశుడు అన్నాడు "ఎక్కడ?"

"చెట్టునీడను బీడీ కాల్చుకుంటున్నారు—హుజూర్."

సతీశుని ఆశ్చర్యానికి మేరలేకపోయింది. ఏమిటీ? శాకాహారాన్ని మాత్రమే భుజించే తన ఛాందస జనకుడు యీ వృద్ధాప్యములో బీడీలు పీల్చటమా?

మర్రిచెట్టు చాటుకు ముఖాన్ని త్రిప్పుకొని యువకుడొకడు ఆదుర్దాగా బీడీని పూర్తి చేస్తూండటం గమనించేడు సతీశుడు.

"బుద్ధిహీనుడా! స్టేషనులో ఏ పేరును పిల్చేవ్? అతనికి నాన్నగారి వయస్సున్నదా?"

"హుజూర్! రవిబాబూ, రవిబాబూ అని నోరు నొప్పి పెట్టేటట్లు అరుస్తూ స్టేషనంతా తిరిగేను. ఎవ్వరూ జవాబిచ్చేరుకాదు. ఆఖరికి ఆయన నావద్దకే వచ్చి అడిగేరు."

ఏమోయి బోసుబాబు బంగాళా తెల్సానీకు" అంటూ. అంచేత యీాయనే—"

"ఛప్. నోర్మూయ్యి—గాడిదా!" సతీశుడు క్రోధంతో అన్నాడు. సేవకుడు రెండడుగులు వెనక్కివేసి చేతులు ముడిచి నిలబడి పోయేడు.

యజమాని మందలింపు స్వరాన్ని ఆలకించిన చెట్టు కింద ఆసామి బీడీని ఖంగారుగా విసిరి, లేచి ముందునకొచ్చి అన్నాడు. "గుడ్ మార్నింగు సార్! మీరు నన్ను గుర్తుపట్ట లేదనుకుంటూ..."

ఆసామీ ముఖం చిక్కి శల్యమైవుంది... మనిషి సన్నగా పొడుగ్గా గెడకర్రలా వున్నాడు. సతీశుడు అతన్ని జ్ఞప్తికి తెచ్చుకొన యత్నిస్తూండగా, అతను నవ్వాలనే వక వ్యర్థ ప్రయత్నాన్ని చేసి, తగిన ధైర్యములేక వూరు కున్నాడు—చుట్టూ తేరిచూస్తూ.

"ఓహో! బృందావన్ కదూ! అవునా! అరే... బృందావన్—" అన్నాడు సతీశుడు గుర్తుకు తెచ్చుకుని.

"అవును! అయితే జ్ఞప్తికి వచ్చేమన్నమాట."

"బృందావన్! బిందే! ఎక్కడ్నుంచీ రావడం? రా... లోపలకురా..."

ఆదిలో వుపయోగించిన "మీరు" వుపయోగించాలో, లేక సన్నిహితాన్ని వ్యక్తపరచే "నీవు" వుపయోగించాలో తోచక బృందావనుడు కాస్సేపు తికమకపడి, ఆఖరికి తెలి విగా అన్నాడు "ఈ బంగాళాలో నేనా నివసించడం?"

"అవును ఇందులోనే! చూడు. దీనికి బంగళా లక్షణా లేమున్నా వున్నాయేమో? ఫానా లైటూ...ఏమీలేవు. అన్నట్లు లేచి స్నానంచేయి. భోజనం చేసేక అన్నీ మాట్లాడుకోవచ్చును."

బృందావన సతీశులు బాల్యస్నేహితులు. మూడో క్లాసు చదువుతుండగా, మధ్యలోనే చదువుకు స్వస్తిచెప్పి ఎక్కడికో వెళ్ళిపోయేడు బృందావనుడు. బృందావనుడు రైల్వే కంట్రాక్టరుగ మస్తుగా సంపాయిస్తున్నాడని తర్వాత విని సతీశుడు సంతోషించకుండా వుండలేకపోయేడు. అవును, తను గవర్నమెంటు స్కాలరుషిప్పుతో కాలేజీలో చదువుతూ, ఖర్చుపెట్టుకోడానికి పైసాలేక బాధపడుతూండగా తనతోటి మిత్రుడు విచ్చలవిడిగా ధనాన్ని వెచ్చిస్తున్నాడంటే ఆలోచించవలసిన విషయమేగా! ఇంతేగాదు. బృందావనుడు వున్నతాధికారులకు, గుమాస్తాలకు లంచాలుగా యిచ్చే డబ్బుకు లెక్కేలేదుట!

కాలచక్రము గిర్రున తిరిగింది. అయినా వీరిద్దరూ బాల్యమునాటి బృందావన్ సతీశులే.

రాత్రి, జనకుని కోసం తెప్పించిన తీపిపదార్థాలను కాజేసిన తర్వాతనే బృందావనుడు తమ బాల్యస్నేహాన్ని, అనుభవాలను గురించి మాటాడసాగేడు. తనకి తెలవకుండానే క్రమంగానే "మీరు"నే సంబోధన. "నువ్వు"గా మారిపోయింది. "నీపని బాగుంది సతీస్! జీవితమంటే నీదే. చక్కగా నెలకి 250 రూపాయలు సంపాదించుకుంటున్నావ్" అన్నాడు.

"పాడు 250—'నేటివ్'లకిస్తున్నారు నాకు మూడువందలు యాభయి! ఇంగ్లండు వెళ్ళి వచ్చేముగదా!"

"మూడువందల యాభయ్యే! ప్రారంభమే అంత అయితే, తర్వాత పెన్షన్‌కూడా వస్తుంది గాబోలు. యింకా ఎంతపైకి పోతావో ఎవరు చెప్పగలరు. మధ్య మధ్య ఏదో పైన కూడా గిట్టుతూంటుందిలే." యీ మాటను అని వూరుకోలేదు బృందావన్. కన్నుగిల్పి నాలుకను పళ్ళసందున యిరికించి సన్నగా యీలవేసేడు—కొంటెగా.

సతీశుడు ఏమీ మాటాడకుండా వూరుకున్నాడు.

బృందావనుడు సంభాషణను కట్టి పెట్టలేదు. ఏమేమో మాట్లాడుతూ, మాట్లాడుతూ క్రమంగా వచ్చిన ధైర్యంతో అడిగేడు. "అయితే నువ్వింకా పెళ్ళిచేసుకోలేదేం? ఆ విషయం శుభ్రంగా కన్పిస్తూనేవుంది. అయితే ఎందుకూ అని నా ప్రశ్న. ఇంగ్లండునుంచి ఎవరినో వకరిని తెచ్చుకోక పోయేవో!"

ఇంతకంటె చక్కని ప్రశ్న బృందావనుడి వద్దనుంచి వస్తుందని సతీశుడు మాత్రము ఏనాడు అనుకోలే. అవును. రైల్వే కంట్రాక్టరు వద్దనుంచి మంచీ మర్యాద కోసం తను ఎదురుచూడటంలో మాత్రం ఏమంత సబబువుంది కనుక. సతీశుడు చిరునవ్వు నవ్వి "అయితే ఇంగ్లీషు మేంసాహెబు గనుక యిక్కడుంటే నీకు యీ మాత్రం మర్యాద అయినా జరిగేది అంటావా?"

ఈ ప్రశ్నకు బృందావనుడు కొంచెంగా ఆశ్చర్యపోయేడు. కాగా చెప్పేడు "ఇటుచూడు అన్నా. నీకు నీ

మిత్రులమీద ఏమాత్రం అపేక్షవున్నా ఇంగ్లీషు మేం సాహె బును మాత్రం పెళ్ళిచేసుకోవద్దు" ఇంతలో సతీశుడు సిగార్‌ని వెలిగిస్తూండటం గమనించి "సిగారా! ఏరకం? కొరోనా కాదుగదా? భేషో—ఏదీఒకటి అందుకో."

"తప్పకుండాను. ఇదిగో కానీయి" అంటూ సతీశుడు క సిగార్‌ని అందించేడు బృందావనుడికి.

బృందావనుడు దగ్గుతూ, వుక్కిరి బిక్కిరి అవుతూ న్నాడు. "అది నిజమేననుకో. మేం ..ఇంగ్లండు...ఎక్కడికి శ్ళలే. అయినా మేమూ యూరోపియన్ మేం సాహెబులను —సిసలయిన వాళ్ళు కారనుకో—చూసేను. ఒక్కసంగతి ుడుగుతా చెప్పు. ఆదేశంలో ఎవర్నయినా ప్రేమిస్తుండే వాడివా?"

సతీశుడికి నవ్వాగలేదు. బిగ్గరగా నవ్వేసి అన్నాడు 'పెళ్ళి చేసుకోవద్దని నువ్వే అన్నావు. పెళ్ళిచేసుకోకుండా ప్రేమించడమెట్లా? పెళ్ళయిన తర్వాతగాని మనదేశంలో ప్రేమ రాదుగా?"

"అబ్బే అదికాదు." నోట్లోని సిగారును బయటకుతీసి దగ్గుతో బాధపడుతూ, కాస్సేపు ఆగి చెప్పేడు. "ఆ రకము ప్రేమను గురించి కాదు నేచెప్పేది. అబ్బో! ఆ ప్రేమ పవిత్ర మయింది. ఆ ప్రేమను సదాచార హిందూసతి తప్ప మరె వ్వరు చూపగలరు? నా మాటను విని మంచి పిల్లనుచూచి త్వరగా పెళ్ళిచేసుకో. ఎందుకూ ఆలస్యం చేస్తావ్? నన్ను అడిగి నట్లయితే చక్కటి పిల్లను వెతికితీసుకొద్దును."

"ఒద్దులే" తేలికగా అన్నాడు సతీశుడు— బృందావనుని ముఖంలోని వుద్వేగాన్ని చూచి కూడా. "ఒద్దు బాబా! నాకు అదేం అవసరంలే. పెళ్ళాం వొచ్చి రాంగానే, మంత్రసాని అవుసరం వొస్తుంది. వెంటనే సంసార జంఝాటం! భార్య సౌందర్య యౌవ్వనాలు యిట్టే మటు మాయమయి పోతాయి ఎక్కడికో."

"ఇంకా. ఆతర్వాత."

"తర్వాత? తర్వాతేముంది." సతీశుడు స్వరాన్ని తగ్గించి అన్నాడు... "ఎవరినో వకర్ని తెచ్చి పెట్టుకోవాలి. అప్పుడు చేసేపనిని యిప్పుడే చేస్తే నష్టమేముంది?"

బృందావనుడు విపరీతంగా నవ్వేస్తూ..."పోదూ..." అన్నాడు.

"కాదు. నిజమే."

"ఛీ. ఛీ."

"అయితే నామాటల్ని నమ్మడంలేదన్న మాట నువ్వు. ఇందులో మనదేశస్థులకి క్రొత్త అయిన విషయమేముంది గనుక—నమ్మకపోవడానికి."

"రామ! రామ! సిగ్గులేదూ! అవినాశమామ పుత్రుడివి కాదూ నువ్వు? కామన్సులో డిగ్రీలేదూ?" అంటూ హడావుడి చేసేడు బృందావన్. గర్వంతో, యింకా "సిస లయిన ఇంగ్లీషు మేంసాహెబ్‌లతో శాకపోయినా మేమూ సల్లాపాలు జరిపేము" అన్నాడు.

"నువ్వు నమ్మవుగాని—నమ్ముతావా? అవును. ఎందుకు నమ్ముతావు. మేము ఇంగ్లాండు వెళ్ళామా

ఏమన్నానా? ఆఖరికి మేమేమీ పెద్ద పరీక్షలన్నా ప్యాసు కాలేదు. కాని నా తాతముత్తాతల ఆత్మశాంతి కాపాడాల్సిన అవసరమేర్పడి నప్పుడు కాని, హిందూకాయస్థకుల ధర్మాన్ని మన్నించవలసి వచ్చినప్పుడు గాని, పెళ్ళీడు వచ్చిన కన్యా భారంతో క్రుంగిపోతున్న తండ్రిని ఆభారం నుంచి రక్షించాలసి వచ్చినా, మేము తప్పించుకో చూచేమనుకున్నావా? వుహు. ఒక్క సారేం—మొనగాణ్ణిగనుక పది సార్లుపెళ్ళిచేసుకుంటాను!" సన్నటి మీసాలను మెలివేస్తూ అన్నాడు.

ఇంతటి మొనగాడితో ఏంమాట్లాడాలో సతీశునికి తోచింది కాదు. అయినా, "అన్నట్లు నీకు పెళ్ళి అయిందో లేదో అడగటమే మర్చిపోయేను. అయిందా?" అని ప్రశ్నించేడు.

"అవును మేము ఎందుకు గుర్తుంటాము. మేము కనీసం ఆఫీసర్లము కూడా కాము. ఒఠి గుమాస్తా గాళ్ళము."

"అదేమిటి? అసన్ సోలులో కంట్రాక్టువ్యాపారం ఏం చేసేవ్?"

"అదేనన్ను ముంచేసింది. నువ్వు నమ్మవుగాని సతీశ్! ఒకరితో కాస్త ప్రేమలో పడ్డామా యిక మూక మూకంతా వచ్చి చుట్టవేసేది అనుకో. అందరికీ బహుమతులు, కానుకలు యిచ్చేసరికి అప్పులు పెరిగిపోయేయి పైగా ఆ దరిద్రపు రోగం—"

సతీశుడు భయంతో తృళ్ళిపడ్డాడు. ఈ మనిషి ప్రక్కను తను కూర్చుని అదే టేబిలుపైన భోజనం చేస్తున్నాడు.

"ఒక్క సంవత్సరంపాటు ఆ రోగంతో తీసుకుని చిక్కి శల్యమయి పోయేననుకో. ఎముకలన్నీ చూడు ఎట్లా బయట పడ్డాయో! ఏమందూ పనిచేయ లేదు. ఆఖరికి—"

సతీశుడు మధ్యలోనే అడ్డొచ్చి- "ఆఖరికి, అయితే వ్యాధి కుదిరిందన్న మాటేనా!" అన్నాడు.

"కుదరకండా ఎట్లావుంటుంది? వ్యాధి నెమ్మదించకపోతే హిందూమతమే మోసమన్నమాట. భుజంగేశ్వర రూపంలో వున్న శివుని గురించి నువ్వు వినలేదా?"

"అబ్బే! వినలేదు." అన్నాడు సతీశుడు.

"మీలాంటి దొరలు వినదగ్గ విషయములు కావులే. కాని పెద్ద పెద్ద యూరేపియన్ దొరలు, టామీలు భుజంగేశ్వరుని పాదాలకు మొక్కుకుని ఆశీర్వాదాలు పొందేరు. నామట్టుకు నేను నిద్రాహారాలు విసర్జించి భుజంగేశ్వరుని పాదాలు ముందు పడ్డాను. "ప్రభూ! నువ్వు రక్షించకపోతే నా గతేమి కాను" అని ప్రార్థించేను. వారం దినాల తర్వాత ప్రభువు దయ నామీదకి ప్రసరించింది. స్వప్నంలో దర్శనమిచ్చి "పోయి మంచి పిల్లను వివాహంచేసుకో. ఆరోగ్యవంతుడి వవుతావు" అని సెలవిచ్చేడు" అన్నాడు బృందావన్.

నవ్వాలో ఏడవాలో తెలియక పోగా సతీశుని కళ్ళలో నీళ్ళు తిరిగేయి. ఏ అమాయక బాలిక జీవితాన్ని వీడు ధ్వంసం చేసేడో?

ఉత్సాహంతో బృందావనుడింకా చెప్పుకు పోతూనే వున్నాడు. "నిజంగా హిందూమతం మహాదొడ్డది. పన్నెండేళ్ళ అనాఘ్రాత పుష్పాన్ని ఏరి వివాహమాడేను. వత్సరాజు

శరీరం నుండి శని తొలగిపోయిన విధంగా, నా శరీరంనుంచి వ్యాధి ఎగిరి చక్కాపోయింది."

సతీశుడు ఆశ్చర్యంతో ప్రశ్నించేడు. "అయితే వ్యాధి నీ శరీరం వదిలి నీ భార్య శరీరాన్ని ఆశ్రయించుకోలేదా?"

బృందావనుడు చేతిరుమాలతో కండ్లు తుడుచుకొని, రుద్ధ కంఠంతో అన్నాడు "నిజంగా పతివ్రతాశిరోమణి అది. ఆదర్శ సతి అనిచెప్పవచ్చును. కాని మనం ఏం చెయ్యగలం. దాని రోజులు అయిపోయేయి. అందుచేత భర్త పాదాల వద్దనే శిరస్సుంచి, శరీరమనే పాతదుస్తుల్ని వదలి ఆత్మ ఎగిరి పోయింది."

"ఆ వెంటనే నువ్వు కొత్తదుస్తుల కోసం వెతకసాగేవు. అవునా?"

"ఒకళ్ళు పని కట్టుకొని వెతికేదేమిటి? దానంతట అదే వస్తుంది. ఒక పెద్దమనిషి కూతురు ఎదిగి కూర్చుంది, ఆయ నేమో పెళ్ళిచెయ్యలేకుండా వున్నాడు "ఆయన్నుంచి ఆ భారాన్ని వదలించు, నాయనా అన్నది." మాఅమ్మ: పరోప కారం మిదంశరీరః కదా! సరే అన్నాను."

ఆగదిలో మాట్లాడుతూ కూర్చుంటే తనకిష్టంలేని విషయాలను గురించి ఎక్కడ మాట్లాడవలసి వస్తుందోననే భయంతో సతీశుడు బాల్య స్నేహితునితో ఆరు బయటకు నడిచేడు. అన్నిటికంటె ముఖ్యంగా, కాస్త గట్టిగా నవ్వేసి, బరువెక్కిన హృదయాన్ని కాస్త తేలిక పర్చుకుందామనే కోరిక కూడా సతీశుని ఆరు బయటికి నడిపించింది.

బయటికి రాగానే సతీశుడు నెమ్మదిగా అన్నాడు. "బృందావన్, ఇటుచూడు. నా బాబూర్చిని (ముస్లిం వంట మనిషి) నువ్వు చూసేవు. వాడు శుభ్రంగా, హిందూభోజనమూ చెయ్యలేడు, యూరోపియన్ భోజనము చెయ్యలేడు. ఈ దేశంలో యూరోపియన్ భోజనం పేరుతో చలామణీ అయ్యే ఆహారాన్ని నేను మింగలేకుండా వున్నాను. ఇంత కంటె శుభ్రంగా హిందూ భోజనం వెయ్యి రెట్లునయం. ఏమంటావ్?"

"అవును, వంట బ్రాహ్మణ్ణి ఎందుకు పెట్టుకోకూడదూ?" అన్నాడు బృందావనుడు.

"వంట బ్రాహ్మడా? ఆమాటకొస్తే వంట బ్రాహ్మణినే పెట్టుకో వచ్చునుగా." అన్నాడు సతీశుడు.

బృందావనుడు కనుబొమ్మలు చిట్లించి, "ఏమిటి? ఎవరినన్నావ్?" అన్నాడు.

"ఆడ వంటమనిషినోయి."

"ఛీ, ఛీ!"

"ఏం?"

"నువ్వు పరాచికాలాడుతున్నావ్?"

"పరాచికాలుకాదు, నిజంగానే చెబుతున్నాను. నా కేపరయితేనేం? ఆహారంతో బాటు అమృతాన్ని పంచే మనిషి కావాలి. భోజన హోటళ్ళలో అట్లా ఏ వంట మనిషి చేస్తాడు చెప్పు. అబ్బబ్బా! వాళ్ళ చేతివంట తినడమంత ఘోరం మరొకటి వుండ దనుకో."

బృందావనుడు నవ్వి, అన్నాడు, "ఊఁ! ఇంకా."

"నువ్వేమైనా అను. చక్కటి పిల్ల వంటమనిషిగా దొరికితే సమర్కండ్, బొఖారాలను యిచ్చెయ్యడానికి సిద్ధంగా వున్నాను. సరేనా! నిజం. వందరూపాయలు జీతమైనా సరే యిస్తాను."

"వందా? ఏదీ ప్రమాణంచేసి చెప్పు."

"ఏమిటోయి అంత ఆశ్చర్యపోతున్నావు. నిజమే వట్టు."

"అవును, ఆశ్చర్యమేముంది. నా జీతమే అంతాకలపి డబ్బాయి లేనప్పుడు వంటమనిషికి వంద రూపాయలంటే ఆశ్చర్యమేమిటి!" అన్నాడు వ్యంగ్యంగా బృందావనుడు.

సతీశుడు, బృందావనుడి మాటల ఆంతర్యం గ్రహించి కొంచెం సిగ్గుపడ్డాడు.

బృందావనుడు యిదేమీ గమనించనట్లే, "అయితే ఆమెకి వక్క వంట చేతనయితే చాలదన్నమాట. ఆమె అందంగాను..."

"పడుచుతనంలోను వుండాలి." అంటూ సతీశుడు వాక్యాన్ని పూర్తిచేసేడు.

"పడుచుదికూడా అయ్యి వుండాలేం?"

"లేకపోతే భోజనమనే సాధారణ విషయం ఆనందాన్నెట్లా యివ్వగలదు?"

"అర్థమయ్యింది"

బృందావనుడికి ఆనందమనే పదం యొక్క అర్థం అర్థమయి వుండొచ్చని సతీశుడనుకున్నాడు. కాని అట్లా జరగలేదు.

"ఇంతకీ అటువంటి మనిషినెవరినైనా ఎరుగున్నావా" అన్నాడు సతీశుడు.

ఓరచూపులు చూస్తూ "ఎందుకు ఎరగనూ!" అన్నాడు బృందావనుడు.

"భోజనం విషయంలో మహాయాతన అనుభవిస్తున్నా గాని, వెంటనే కలకత్తా వెళ్ళి ఆవిడని పంపించు." అన్నాడు సతీశుడు, ఆలస్యాన్ని సహించలేనట్లు.

"అర్థమయిందిగా," కొంటెగా నవ్వుతూ బృందావనుడు అన్నాడు. "ఇంగ్లండులో కామర్స్ డిగ్రీ సంపాదించుకుని వచ్చిన వాళ్ళకి సుగుణాలు వుంటాయని అనుకుంటూ వుండేవాణ్ణి."

"నిజమేకాని, మనిషి తన అవసరాలకి అనువుగా ప్రవర్తిస్తాడని మరచిపోతే ఎలా?"

మర్రిచెట్టు నీడనున్న చప్టామీద యిద్దరూ విశ్రాంతిగా కూర్చోగానే, బృందావన్ అన్నాడు. "నాకో అమ్మాయి తెలును. పేరు సువర్ణ! పేరుకు తగినట్లే బంగారపు ఛాయ! ఆమె వయిపు చూస్తేనే కళ్ళు జిగేలుమంటాయి...అంత అందం."

"అవివాహితా? వితంతువా?"

"ఏదీ కాదు. ఇల్లాలు!"

ఈసారి సతీశుడికి నిజంగా ఆశాభంగ మయ్యింది. కాగా అన్నాడు. "అయితే వదిలెయ్యి."

"ఉండు. చివరంటావిను. ఆమెకు వివాహమయినా భర్తతో ప్రమేయ మేమీలేదు. ఇక్కడేవుంది. నిన్ను

కొంచెం ఖంగారు పెట్టాల్సివస్తుంది...ఆమె భర్త భయంకర వ్యాధితో బాధపడ్తున్నాడు."

సతీశుడి మొహం ముడుచుకుని పోయింది. బృందావనుడు మాత్రం మామూలు ధోరణిలోనే చెప్పుకుని పోనాగేడు. "అతనెక్కడికో—ఢాకాకో చిట్టగాంగ్‌కో వెళ్ళేడు. కొన్నాళ్ళ తర్వాత చేతిమీద, కాళ్ళమీద బొబ్బలతో తిరిగి వచ్చేడు. స్టీమర్ బాయిలర్ ప్రక్కన పనిచెయ్యడంవల్ల అవి వచ్చేయంటాడు అతను. సువర్ణ నిజమేనని నమ్మింది అప్పుడు. ఆమెకి ఎన్నేళ్ళుంటాయి అప్పుడు? మహావుంటే పదమూడు. నిజంగా సేవఅంటే ఆమె చేసిందే సేవ. అబ్బా! ఏం చాకిరీ చేసిందనుకున్నావ్? ఎంత చేసినా ఆబొబ్బలు మాత్రం మానేయికావు. క్రమంగా అవి అతని శరీరం నిండా వ్యాపించేయి. హరిపాదుడికి కలకత్తాలో స్వంత యిళ్ళు పదహారున్నాయి. అతను పొందిన చికిత్స నావంటి సామాన్య కంట్రాక్టర్ కలలోకూడా పొందలేడనుకో. భుజంగేశ్వరుణ్ణి గురించి అతని కెవ్వరూ చెప్పకపోవడం మూలాన, భార్యని కూడా తాకకుండా, ఎడంగా వుండేవాడు. బుద్ధిహీనుడు! ఆమెని యిట్లా స్పృశించేవాడు కూడా కాదు, ఆఖరికి."

సతీశుడు హరిపాదుని మనస్సులోనే వెయ్యి విధాల అభినందించేడు.

"భార్యకి యుక్తవయస్సు వచ్చేసరికి హరిపాదుడు మూలపడ్డాడు. ఆమెకి క్రమంగా అసంతృప్తి, నైరాశ్యం ఎక్కువవ సాగేయి. భర్త అంటే ఏవగించుకొనే స్థితికి వచ్చేసింది. కాస్తాకూస్తా చాకిరీ చేసిందా ఆమె! తను చేసిన చాకి

రీకి యిదేనా ఫలితం? ఈ ప్రశ్న ఆమెను నిరంతరం వేధించ సాగింది అనుకుంటాను. అయినా యిటువంటి ప్రశ్నలన్నీ ఎందుకొస్తాయో తెలుసా? నవలలు అతిగా చదవటంవల్ల! సరే. ఇంతకీ ఏమయ్యింది? ఒకనాడామె గంగానదికి స్నానానికి వెళ్ళి తప్పిపోయింది."

"నవలల చదవడంవల్లే?" అడిగేడు సతీశుడు.

"మరెందు కనుకున్నావు?" వుద్రేకంగా అడిగేడు బృందావన్.

"ఈనాడు ప్రతీ యింట్లోను స్త్రీలంతా నసుగుతూంట మరెందు కనుకున్నావ్? ఈ నవలలే కారణం. ఎందుకూ ఒక్క సంగతి చెబుతాను విను. ఇంతవరకూ మా ఆవిడ, చేతిలో పుచ్చుకోతగ్గ పుస్తకం నాకు వక్కటయినా యీనాటి పుస్తకాల్లో అగుపించలే. ఆఖరుకు ఆడవాళ్ళు రాసినవైన అంతే... అట్లాగే వుంటూవున్నాయి."

"సర్లే. తర్వాత సువర్ణ ఏమయ్యింది?"

"ఏమవుతుంది? తిరిగి ఆమె కాశీ క్షేత్రంలో పట్టుబడింది. ఇరుగు పొరుగు వాళ్ళంతా చక్కటి మాటల్తో బుద్ధి చెప్పి ఆమె తప్పును ఆమెకు చూప ప్రయత్నించేరు. కాని ఆమె అందరికీ ఒకటే జవాబిచ్చింది: "విరాగిలా జీవితాన్ని గడపడం నా వశంకాదు. చెప్పండి మీలో ఎవరయినా అట్లా జీవించ గలరేమో?" ఎవ్వరూ మాటాడలే. ఏంచేస్తాం. సిగ్గు పడి తోకలు ముడుచుకొని కొంపలకు చేరుకున్నాం.

"మరి సువర్ణ గతి?"

"సువర్ణ కేం! శుభ్రంగా మేనమామగారి యింటికి పంపించేసేను. ఆమెకు తండ్రి లేడు. తల్లి మాత్రం అక్కడే వుంటూంది. నవలల మహాత్యం ఏమవుతుంది? మేనత్త మేన మామ బిడ్డలు ప్రేమలో పడకపోతే సంఘానికి అభ్యున్న తెక్కడిది? అందుచేత సువర్ణను తిరిగి భర్తవద్దకే పంపించి వేసేను. సరే, యీలోగా జీవితమంటే రోత జనించింది— హరిపాదుడికి. భుజంగేశ్వరుని ఎక్కడ దర్శించుకోవచ్చో, నేను అగుపించి అతనకి చెప్పే వకనాడు. సరిగ్గా నేను పొందిన సలహానే ఆతనూ కలలో పొందేడు. కాని మితిమీరి సిని మాలు అవీ చూడటంవల్ల సువర్ణబుద్ధి పాడయిపోయింది. "నేను సౌఖ్యం పొందాలంటే వ్యాధిగ్రస్తురాలవాలని ఎక్కడ నైనా వుందా?" అందిట భర్తతో. విన్నావా సినిమాల మహాత్యం!"

క్షణము క్రితమే హరిపాదుని లోలోనే అభినందించిన సతీశుడిప్పుడు సువర్ణను ధైర్యంగా—బృందావనుడు వినేట్లుగా అభినందించేందుకు ఏ మాత్రం జంకలేదు.

"ఏమిటీ? ఆ రాలుగాయిని — పొగుడుతున్నావా నువ్వు!" బృందావనుడు ఆశ్చర్య పడ్డాడు.

"వూ...కథ పూర్తి చేద్దూ..."

"పూర్తా?" బృందావనుడు సంతోషంగా చెప్పేడు. పూర్తి చెయ్యడాని కేవుంది? మహావైభవంగా హరిపాదుడికి మళ్ళీ పెళ్ళి చేసేం. మొన్ననే జరిగింది...యింకా విందు భోజనాలు తల్చుకుంటే వొళ్ళు పులకరిస్తూంది. నిజానికి, హరిబాదుడికి విందు చేయడం బాగా తెల్సు!"

"అబ్బా—నీభోజనం పాడుగాను, తర్వాత ఏమయ్యిందో చెబుదూ."

బృందావనుడు విసుగుకుంటూ చెప్పేడు "ఏమవుతుంది చెప్పు? హిందూసతికి భర్తతప్ప మరో ప్రపంచమేముంది? కొన్నాళ్ళ తర్వాత అంతా మామూలు స్థితికి రావడం నువ్వే చూడగలవ్! ఏమవుతుందీ! ఏమీ అవ్వదు."

ఆశాకిరణాన్ని చూచినట్లువ్వగా సతీశుడడిగేడు.

"అయితే పరిస్థితులింకా మామూలు స్థితికి రాలేదా?"

"లేదింకా. అప్పుడప్పుడామె మా యింటికొచ్చి అంటూంటుంది—"బృందావన్ బాబూ! నేనీ జీవితరథాన్ని లాగలేకుండా వున్నాను. నాకేదయినా దారిచూపి రక్షించవ్వా. లేకపోతే చూస్తూండగానే నేను నా జీవితాన్ని నాశనం చేసుకోవలసి వస్తుందిసుమా!" విన్నావా?"

"బాగానేవుంది. మరయితే ఆమెకేదో దారి ఎందుకు చూపకపోయేరు?"

బృందావనుడు చెప్పేడు, "మొదటి విషయం ఆమె బ్రాహ్మణస్త్రీ రెండో విషయం ఆమె మరొకరి భార్య."

సతీశుడు ఆలోచనతో నడుస్తూ, నడుస్తూ, ఆగి అడిగేడు, "బృందావన్ వక్క విషయం అడుగుతా చెప్పు. సువర్ణకు ఆ వ్యాధి లేదుకదా?"

"నాకు తెల్సినంతవరకూ లేదు."

"ఖచ్చితంగా తెల్సుకోవాలని వుంది."

"ఆ విషయం నేను చెప్పలేను."

"అట్లాకాదు. ఆమెను డాక్టరు చేత పరీక్ష చేయించాలి యీ విషయం నువ్వు కాస్త శ్రమపడాలి బృందే."

"ఎవరూ! నేనా?" ముఖం పాలిపోయింది బృందావనుడికి.

"అవును. నీవల్లే కావాలి. అన్నట్లు నేడో, రేపో కలకత్తాకూడా వెడుతున్నావుగా?"

"ఆ శేనా?"

"హాస్యంకాదు బృందావన్. యీ వక్కవుపకారం నువ్వు చేసితీరాలి నాకు, ఏమంటావ్."

"ఆగు. నన్ను కాస్త ఆలోచించుకోనీ."

"ఇందులో ఆలోచించడానికి ఏముందోయి. సువర్ణ భర్తను వదిలివేసిందా లేదా?"

"వదిలేసినట్లే దాని అర్థం."

"వయస్సెంత వుంటుంది యిప్పుడామెకు. మైనారిటీ అయినా వదిలిందా?"

"పందొమ్మిదో. ఇరవయ్యో వుంటాయి."

"సెహాభాస్. అయితే ఫర్వాలే; ఆమెను మళ్ళీ తప్పిపోమ్మను."

"నిజం చెప్పాలంటే హరిపాదుడి కోరిక గూడా అదే. ఆమె కనుక దుర్నడతను పడితే హరిపాదుడి పరువు ప్రతిష్ఠ లేమయి పోనూ? అతను నల్గురిలోనూ తలెత్తుకు తిరగగలడూ? ఆఖరుకు అతని స్నేహితులుకూడా ఆమె వద్దకే జేరుతూంటారు—ఖర్మం!"

"పొరుగువాళ్ళు కూడానా?"

"ఆఁ! అంతాను,"

"ఏమంటున్నావ్ బృందే—నువ్వు." సతీశుడు బాధా పూరిత స్వరంతో అడిగేడు. "నీతులు చెబుతూ, సంఘాన్ని శాసించే ఆ ఛాందస బ్రాహ్మలుకూడా..."

"ఆ ఎందుకు వెళ్ళకూడదూ? శాస్త్రంలో ఎక్కడా మొగాడికి వ్యభిచారం పనికిరాదని లేదుగా!"

సతీశుడు క్రోధంతో ముఖం ఎర్రబడగా, అడిగేడు— "అయితే వాళ్ళంతా ఆమె "మృత్యువు" కోసం ఎదురుచూస్తున్నారన్న మాట."

బృందావనుడు వులిక్కిపడి "ఏమిటీ అంతటి సౌదర్యం, యవ్వనంగల పిల్లకు అప్పుడే మృత్యువా? భగవంతుడు ఆమెను కాపాడుగాక." అన్నాడు ఆకాశంవైపుచూస్తూ.

"చావుగాక మరేం? వ్యభిచారం స్వీకరించడం, ఆమెలోని మానవత్వం నశించడమే ననే వుద్దేశ్యంతో మాట్లాడుతున్నా నేను." సతీశుడు చెప్పేడు.

బృందావనుడు నిశ్చల స్వరంతో "అదంతా భగవంతుడి చేతుల్లో వుంది. పతితలే లేకపోయినట్లయితే, యీలోకంలో పాపులనే వారే వుండరు. అప్పుడు భగవంతు డెవర్ని కాపాడేది?" చెప్పేడు.

సతీశుడికి బాగా తెలుసు—బృందావనుడితో వాదించడం సులభమయిన కార్యంకాదని. కనుకనే సతీశుడు మాట్లాడకుండా సువర్ణ సమస్యను గురించి ఆలోచించసాగేడు తీవ్రంగా. ఆమెయే కనుక వ్యభిచారాన్ని స్వీకరించినట్లయితే తను ఏవ్యాధినుంచి దూరంగా తొలగిపోదామని చూస్తూందో

ఆ వ్యాధిచేత నశిస్తుంది. సంఘం నిర్ణయించిన చట్టం వకటి వుంది. అది మహా ద్దొడ్డ శాస్త్రం. దానికే కట్టుబడి వుంటే ఎప్పుడో వకనాడు సంఘం వారిని నెత్తికెక్కించుకుంటుంది.”

పరియాచకంగా ప్రారంభించిన విషయం, ఆఖరుకు మహా సమస్యఅయి కూచుంది—సతీశుడికి. అయినా ఇప్పటికయినా సతీశుడు మాటాడక వూరుకోవచ్చు. కాని బృందానుడితో “ఆమెను యిక్కడికే పంపించు. నేనే ఆమెను డాక్టరుచేత పరీక్ష చేయిస్తాలే.” అన సాగేడు.

దీనితో బృందానుడు మతిపోయినట్లు అయి “ఇక నేను నీవద్దకు వచ్చిన దెందుకో చెప్పివేయడం మంచిది. నువ్వు మా దొరగారికి నన్ను “రికమెండు” చేస్తూ ఓ వుత్తరం రాసి యివ్వాలి. నూటయాభయి రూపాయలు జీతమొచ్చే ఒక నౌకరీ ఖాలీగావుందని వందమైళ్ళ నుంచి నీకోసం పరుగెత్తుకు వచ్చే.”

“మీ దొరగారెవరో నాకు తెలవదే! ఆయన నన్నెరుగునా?” సతీశుడు అడ్డు ప్రశ్న వేసేడు.

“ఫర్వాలే. సతీశుని వీపుతడుతూ బృందావన్ అన్నాడు.” ఆయన నిన్నెరుగకపోయినా బ్యాంకిలోని నీహోదా ఎరుగునులే. ఇవ్వేళే నువ్వు సిఫారుసు వుత్తరం ఒకటి రాసి యివ్వాలి సుమా. నేను మధ్యాహ్నం బండికి వెళ్ళిపోవాలి, అర్థమయ్యిందా!

బృందావసుడు వెళ్ళిపోయి నెలరోజు లయ్యిపోయింది. సతీశుడు అతనితో చెప్పిన విషయాన్నే పూర్తిగా మరచి పోయేడు. నెలరోజులనుండి కాలాన్ని—సమ్మ్రద్ వంట భోజ నాన్ని తింటూనే వెళ్లబుచ్చుతూన్నాడు. ఈ మధ్యనే తండ్రి వచ్చి, వివాహం చేసుకోమని బలవంతం చేయడం, అతను నిరాకరించడం కూడా జరిగిపోయేయి. అవును. ఎకానామిక్ విద్యార్థి అయివుండి తను ఈ అస్థిర సంపాదనతో వివాహానికి ఎట్లా అంగీకరిస్తాడు. బర్తు కంట్రోలు అమలు జరుపుకునే దాంపత్యాలు కావయ్యే యీ దేశములోని దాంపత్యాలు. అట్లాగే అయితే లేనిదేముంది కాని ఏ మాత్రం మాతృ త్వాన్ని నిరోధించినా, నిర్బంధించినా, యీ దేశపు యిల్లాళ్ళు అసలు సంసారము అక్కర్లేదంటారుగదా!

సతీశుడు వకనాడు క్లబ్‌నుంచి తిరిగి వచ్చేసరికి, తన గదిలో కూర్చునివున్న స్త్రీని చూసి ఆశ్చర్యచకితుడయ్యేడు. బ్రహ్మచారి గృహంలోని స్త్రీ. బ్రాహ్మణవిధవ వంట పాత్ర లోని మత్స్యము వంటిది.

ఎవరీమె? తన నీ పరిస్థితిలో చూస్తే తననుగూర్చి లోకులేమనుకుంటారు. తను క్లబ్‌లోని గౌరవ సభ్యుడు కూడాను.

సతీశుని తనలో యిముడ్చుకోడానికి భూమి బ్రద్దలవ లేదు, స్వేదబిందువులు మాత్రం ముఖాన్నిండా ఆవరించు కున్నాయి. రెండు కాళ్ళకూ పారిపోదామా, నిలుద్దామా అనే అవిరామ సంఘర్షణ జరుగుతూంది. సమ్మోహింపబడి

నట్లు కండ్లుమాత్రం ఆమెవైపు తిరిగి సౌందర్యాన్ని ఆస్వాదింప సాగేయి.

ఏం సౌందర్యం! పెట్రొమాక్సు లైటు వెలుగులో ఆమె ముందుకువంగి, విదేశీయ పత్రికలోని బొమ్మలను తదేక ధ్యానంతో చూస్తూవుంది.

కాని ఎవరీమె? తనగదిలో ఎందుకుంది, అనే ప్రశ్నలు అతన్ని వేధించసాగినయి.

అలికిడిని విని ఆమె సతీశుని రాకను గ్రహించింది. కుర్చీలోనుండి లేచి వక్కసారి సతీశునివైపు దృష్టిసారించి, మాట్లాడకుండానే లోపలకు రావచ్చునని సంజ్ఞచేసినది. అయస్కాంతంచేత ఆకర్షించబడినట్లు సతీశుడు లోపలకు నడచి ఆమె ప్రక్కనే ఎడంగా కూర్చున్నాడు. ఆమెకూడా తిరిగి కూర్చుని అతనిని మరొకసారి చూచింది—అతని నిగ్రహ శక్తిని తూచుతున్నట్లు.

సతీశుడికి వక్కసారిగ—ఎందుకోగాని కథంతా తలక్రిందులయినట్లు అన్పించింది. తనే పెండ్లికూతురయినట్లు, తనను చూడటానికి వచ్చిన వరుడు ఆమే అయినట్లుగాను అతనికి అన్పించింది. సతీశుడు అసౌఖ్యంగా వకసారి అటూయిటూ చూచేడు. తనేదయినా —ఏ విషయాన్ని గురించయినా గానీ మాట్లాడ గలిగితే ఎంత బాగుణ్ను! కాని స్వప్నంలో వలె ఆమెవైపే చూస్తూ, మాటాడలేకుండా కూర్చుండి పోయేడు. మాటాడదామనే కోరిక అణచరానిదయినప్పుడు స్వప్నాన్ని నాశనం చేయాలి. కాని అతనిలో స్వప్నాన్ని పాడుచేయాలనే వాంఛ ఏమాత్రం లేకపోయింది.

ఆమె విమర్శనాత్మక నేత్రాల క్రింద అతను జైలులోని ఖైదీలా బాధపడసాగేడు. బహుశా రాత్రంతా యిదేరీతిగా గడిచిపోయి వుండెడిదేమొ? కాని యజమానియొక్క విశ్వాస పాత్రుడైన సేవకచక్రవర్తి అటువంటిపని నెట్లా జరుగనిస్తాడు?

సేవకుడువచ్చి అడిగేడు "డ్రింకు వకటి తెమ్మంటారా బాబూజీ!"

త్రుళ్ళిపడి సతీశుడన్నాడు "ఏమిటీ? డ్రింకా? ఓ-ఛోటా పెగ్గు పట్రా" ఆమె వయిపుతిరిగి "మీారూ తీసుకుంటారు కాబోలు. అవునా?. . ." అడిగేడు.

కటువుగా అంది ఆమె "నే నిక్కడకు "టీ" తయారు చేయడానికి వచ్చేనుగాని, త్రాగడానికి కాదు."

విషయమంతా సతీశునికి వెంటనే అర్థమయి పోయింది. అయితే యీామేనా—? ఆమెనే అడిగేడు ప్రశ్నను. కించిత్తయినా తొణకక చెప్పింది ఆమె, "అవును నే నే సువర్ణను. బృందావన్ బాబు పంపించేడు."

సతీశుడు అమితముగా లజ్జపడ్డాడు. తను కోరుతూన్నదీ సువర్ణకు తప్పకుండా తెల్సివుండాలి. తనను గురించి ఏమను కుంటూాన్నదో యీామె? తనెంత సిగ్గు లజ్జా లేనికార్యానికి ఒడిగట్టుకుందో తెల్సికూడా యిలా ధైర్యంగా యిక్కడకు రావడం......ఛీ, ఛీ, ఎంత సిగ్గూ!

ఆమె కండ్లలోనికి చూడడానికి వెరుస్తూ సతీశుడు అన్నాడు—మర్యాదగా "కాదు, కాదు. అదెన్నటికీ కాదు. మీారెందుకు చేయి కాల్చుకోవడం?"

తన విశాలనయనాలతో ఆమె అతనిని చురుగ్గా చూస్తూ అంది. "నమ్మండి నన్ను. నేను ఆరోగ్యంగా నేవున్నా' నాకే..."

"అబ్బే, అది—కాదు నేననేది. క్షమించండి. నేను అట్లా అనలే," సతీశుడు తడబడ్డాడు సిగ్గుతో.

"అయితే ఆజ్ఞయివ్వండి. టీ తయారుచేసి తీసుకు వస్తా.

"వద్దు. వద్దు సువర్ణాదేవి! నా సేవకులుండగా మీ రెందుకు శ్రమపడడం? మీరు కూర్చోండి."

నిరాశతో సువర్ణ అడిగింది. "అయితే నేనిక్కడ ఏహక్కుతో వుండగలనో తెలియ జెప్పండి కాస్త."

శుద్ధ అపరిచిత స్త్రీని వివాహమాడి ఎవరయినాగాని ఎట్లావుండగలరో సతీశునికి అర్థము కాకపోయింది. అటువంటి వన్నీ వట్టిడాంబిక వచనాలని అతని బుద్ధి చెప్పసాగింది.

ప్రతీ మానవహృదయం కామవాంఛలతోనూ, పాప ప్రవృత్తులతోనూ యవ్వనంలో నిండుకొనివుంటుంది. ఇవన్నీ వివాహ మంత్రాలతోనే కాబోలు నిర్మూలింపబడేది. అప్పుడు గాని ఆత్మని, యితరులని, మోసగించడం సులభం అవదు. వివాహ మంత్రాలతో అంతకు ముందు పశువాంఛ అనబడేది కాస్తా, మహాపవిత్రమయి కూర్చుని, విద్యుక్తధర్మ మవుతుంది. అప్పుడు అపరిచిత స్త్రీ శరీరంమీద చేతులు వేయడానికే వకరి అనుజ్ఞ అక్కరవుండదు. వివాహతంత్రమే పెద్ద "పెర్మిటు."

ఇదంతా ఎట్లావున్నాగాని తను సువర్ణను వివాహ మాడడానికి ఏమాత్రం మార్గమున్నా ముందంజ వేసేవాడే. అటువంటి సౌందర్యరాశికి తన కష్టసుఖాల్లో పాలిచ్చి వుండ గల్గితే నిజంగా తనజన్మ సార్థకమయివుండేది. కాని యిటు వంటి ధైర్య సాహసాల్తో కూడిన కృత్యాలు తనవంటి సామాన్య మానవుడి వశమా! ఏ పార్థుడివంటి మహావీరులో యీ కార్యాలకి సమర్థులు, అనుకున్నాడు సతీశుడు నిట్టూ రుస్తూ! అవును తనేం పార్థుడా? అసలు బృందావనునిముందు డాంభిక వచనాలు ఆడటానికికూడా తగదు. ఇక సువర్ణను వివాహమా......

అతను మాటాడకుండా వూరుకోనడం చూచి సువర్ణ నెమ్మదిగా అడిగింది. "అయితే మీ పాదాలముందు నాకు స్థానం లేదూ?"

దీనికేమని జవాబిచ్చేది? "లేదు" అని వక్కాణుక్క అనినట్లయితే సమస్యంతా యిట్టే విడిపోయేది. కాని యీ సుందరిని వెళ్ళిపొమ్మని ఎట్లా చెప్పాలో సతీశుడికి అర్థము కాలేదు. నిజానికి అతను ఇంగ్లండునుంచి తిరిగివచ్చాక స్త్రీలతో స్వేచ్ఛగా మాట్లాడ్డమే మరచిపోయాడు. అలాగే ఇక్కడ జీవితమంతా సంఘాచారాల్ని అనుసరించడం హద్దులు దాటకుండా జాగ్రత్తపడటం— మొదలయిన విష యాలతోనే అంతమయ్యేటట్లుంది.

"ఇటుచూడండి"—అని, తర్వాత మరేం మాటాడ లేక పోయేడు సతీశుడు. క్రమంగా ఆమెలో నైరాశ్యం అధిక

మవుతూందని గ్రహించి తిరిగి అన్నాడు "బృందావన్ మీాతో ఏమి చెప్పేడో..."

"అవును. మీారు వంటమనిషి కోసం ప్రయత్నిస్తున్నారని బృందావన్ చెప్పేడు. నేను బ్రాహ్మణుల బిడ్డను. శుభ్రంగా, శుచిగా వండగలను. కాని పాశ్చాత్య వంట విషయంలో......" సంకోచిస్తూ అన్నది.

వెంటనే సతీశునికి మార్గం అగుపించింది. "కాని నాకు కావలసిన భోజనమే అది! నేను ఇంగ్లండునుంచి తిరిగి వచ్చేనని మీాకు తెల్సుననుకుంటా. 'బీఫ్' తప్ప నేనుమరేమీా స్వీకరించను."

ఆమె చలించకుండా అన్నది "ఎవరయినా కాస్త ఎట్లా వండాలో చూపినట్లయితే నేనూదాన్ని వండగలననుకుంటా."

సతీశుడు కాస్త ఆందోళన పడ్డాడు. అతన్ని పట్టుకు వేధించే సమస్య వక్కటే వక్కటి! అదల్లా ఆమెను వదిలించుకోడమే. అతను చెప్పేడు. "ఒక్క ఆహార విషయమేకాదు: డ్రింక్సు విషయం కూడా ఆలోచించాలి. అవికూడా లేందే భోజనం దిగదు."

ఆమె కాస్త వెలవెలబోయి అన్నది. "ఎట్లా కలపాలో మీారు చెప్పలేదూా వకనాడు?"

"నేనసలే కోపిష్టి మనిషిని. తాగివచ్చినప్పుడు ఎదట పడ్డవారు చాలా బాధపడవలసి వస్తుంది"

ఇదంతా విన్నాకకూడా ఆమె వెనుకంజ వేయకపోవడం అటుంచి, చిరునవ్వుతో అన్నది "ఇదంతా హిందూా

స్త్రీలకు క్రొత్తకాదు. మంచిదే. మీరుకూడా కావలిస్తే తన్నండి నన్ను. నష్టమేముంది?"

హతబుద్ధుడిలా చూస్తూ సతీశుడు చెప్పేడు "జీతం విషయం. ఇప్పుడప్పుడే నేను మీకు జీతం యివ్వలేనను కుంటా. ఆడవంటమనిషి కావాలని అన్నంత మాత్రాన యిప్పుడుండే మనిషిని నేను తీసివేయలేను పైగా వాడు మీకు ట్రెయినింగ్ యివ్వవలసి వుంటుంది. ఇదంతా వాడికి జీతం యివ్వందే చేయడుకదా. ఇద్దరికీ జీతం నేనెట్లా యివ్వ గలనూ......"

ఒక్క క్షణం ఆలోచించుకుని సువర్ణ అన్నది "మంచిదే మీ యిష్టం వచ్చినప్పుడివ్వండి జీతాన్ని. అసలు యివ్వక పోయినా ఫర్వాలే."

సువర్ణా నిన్ను నా శిరస్సుపై పెట్టుకొని పూజిస్తా. నువ్వు లేందే నేను జీవించలేను. నీవే నా సర్వస్వం, అని అందామన్పించింది, సతీశుని పుత్తేజిత హృదయానికి వక్క సారిగ. కాని ఆమెతో కలసి సంఘంమధ్య జీవించాలనే విష యం గుర్తుకురాగా నే ఎందుకో అతనిని చెప్పరాని సిగ్గు ఆవరిం చేసింది. తనేదో ఘోర దుష్కృత్యం చేయబోతున్నట్లని పించింది.

నిశ్శబ్దంగా కూర్చున్నాడు సతీశుడు...శూన్యంవైపు చూస్తూ.

నీరుకమ్మిన కనులను తుడుచుకుని, అతని పాదాల ముందు వంగి అంది రుద్ధకంఠంతో "నన్ను నమ్మండి. నాకేం ...లేదు..."

ఆమె చేతులను తన చేతులలోనికి తీసుకుని ఆమెను అక్కడనుండి లేవదీసే ధైర్యం అతనిలో లేకపోయింది. కాగా అన్నాడతను. "అయినా నువ్వు మరొకరి భార్యవు."

జలజలా కన్నీరు కారుస్తూ ముఖాన్ని పైకెత్తి గద్గద స్వరంతో అన్నదామె "కాదు. మీరే నా సర్వస్వం మీరే నా ప్రభువు." కన్నీరు చెక్కిళ్ళనుండి ధారగా ప్రవహించ సాగింది.

ఏమిటీ వ్యక్తికి తనతో ప్రణయం! తనొక సంగీత ప్రియుడా, కళాభిమానా, రసికుడా? ఇటువంటి ప్రణయాల్లో నాయకుడుగా వుండటానికి తనవంటి సామాన్య మానవుడికి అర్హత వుందీ?

సమ్మద్ టీ తీసుకువచ్చేసరికి ఆమె ఆత్రుతతో లేచి నిలబడి, కండ్లను తుడుచుకుంటూ వెళ్ళి కుర్చీలో కూలబడ్డది. సమ్మద్ టీని బల్లపయినే వుంచి యిద్దరికీ అతివినయంగా సలాంచేసి వెళ్ళి పోయేడు.

ఇది గమనించిన సతీశుడి గుండె బితుకు బితుకు లాడింది. తనను గురించి సమ్మద్ ఏమనుకుంటూన్నాడో? బహుశా బయటకు వెళ్ళి తదితర సేవకులందరితోను తను చూచి వచ్చినసంగతి చెప్పి నోటికివచ్చినట్లు వాగుతూ అంతా నవ్వుకుంటూన్నారు కాబోల్ను.

సతీశుడు నెమ్మదిగా చెప్పేడు "ఎంత దురదృష్టవంతు రాలవ్ సువర్ణా! నీ కష్టాలను చూచి నే నెంతగానో విచారి స్తున్నా. ఏ మాత్రం సహాయం చేయలేని పరిస్థితుల్లో వున్నానే అని చింతిస్తున్నా. ఒక వేళ నేను సాహసించినా

కొలది దినాల్లోనే నీలోని మాతృత్వం వెల్లుబకవచ్చు. అటు వంటి కోరికల్ని నే నెట్లా సహించగల్ను?"

తలను వంచుకుని ఆమె అన్నది "ఆ విషయం నేను ఆలోచించనే లేదసలు. మీ కెందుకా చింత"

మలినహాసం చేస్తూ సతీశుడన్నాడు "నువ్వు ఆలోచించకపోయినా ప్రకృతి ఆలోచిస్తుంది. ప్రకృతిని ఎవ్వరూ ఎదిరించ లేరుగా."

"జరగవలసిన దేదో జరుగుతుంది. ఎప్పుడో జరగబోయే దానికి యిప్పటినుండీ బాధపడటం ఎందుకూ? ఈ ప్రపంచంలో మరెవ్వరూ తల్లులవడం లేదుకాబోలు!"

"కాని సమాజం నీ బిడ్డను ఏవగించు కొంటుందిగా?"

"మీరుండగానే?"

"నేనెవర్ని! సంఘ నియమాలను కాల దన్నినవారే బిడ్డ పుట్టేసరికి వణికి పోతూంటారు."

సువర్ణ యీ విషయాన్ని ఎంతమాత్రమూ నమ్మినట్లు కన్పించదు. పరధ్యానంగా ఆలోచించుకుంటూ అట్లానే కూర్చుండి పోయింది. 'టీ' చప్పగా చల్లారి పోయిందికూడాను.

ఆమె సౌందర్యాన్ని తనివితీరా ఆస్వాదిస్తూ అన్నాడు సతీశుడు చిట్టచివరకు "టీ త్రాగు సువర్ణా—చల్లారి పోతూంది. నువ్వేం భయపడకు. నేను స్టేషనుకు వచ్చి బండీ ఎక్కిస్తాను."

సువర్ణ చట్టున లేచి నిలబడింది. ఒక్క క్షణం సతీశుని ముఖాన్ని పరిశీలనగా చూచి, వక్క నిట్టూర్పు విడిచి అన్నది "రైలు ఎక్కడం ఒక అబలకు నేర్పేంత ధైర్య సాహసాలయినా

మీాలో వున్నందుకు సంతోషంగా వుంది. అయినా నేను వక్కర్తైనే వెళ్ళగల ననుకుంటా"

తడబడే పాదాలతో గుమ్మం దాటింది సువర్ణ.

రెండు సంవత్సరాల తర్వాత విషయం. ఒకనాడు ఆక స్మికంగా బృందావనుణ్ణి కలుసుకున్నాడు సతీశుడు. ఇద్దరూ చాలాసేపు పిచ్చా పాటీ మాట్లాడుకున్నాక సతీశు డడిగేడు యాదాలాపంగా "సువర్ణ, సంగతి ఏమయ్యింది?"

బృందావన్ ఆశ్చర్యంగా అడిగేడు "సువర్ణా!" తర్వాత గుర్తుకు తెచ్చుకుని, నవ్వి అన్నాడు "ఓహో సువర్ణా! ఆ వంట మనిషి కదూ?"

"అవును. నన్ను నరక కూపానికి యీడ్వబోయిన ఆ వంటమనిషి సంగతి" అన్నాడు సతీశుడు సిగ్గుతో.

"ఇప్పుడామె పేరు సువర్ణ కాదు, ఫర్జాందు వున్నీ సా! ఆమెను పెషావరులోని వక పండ్ల వర్తకుడు పెళ్ళాడేడు. అబ్దుల్ ఖాదర్ అనే కుర్రాడు. వాళ్ళ కిప్పుడో పిల్లాడు కూడాను."

సతీశుడికి వెంటనే అర్థమయ్యింది. హిందూమతం దిన దినాకి ఎందుకు క్షీణించి పోతూన్నదీను! కాగా అన్నాడు "సిగ్గు! సిగ్గు! ఆఖరికి మతం మార్చుకుందీ—శుభ్రంగా చావ నయినా చావక."

బృందావను డేమీా మాటాడలే. కాని ఎక్కడనుండో మాత్రం గుడ్లగూబ వకటి అతని విమర్శకు ఆమోదాన్ని తెల్పింది వ్యగ్యంగా.

త్వరలో

తెలుగు పాఠకుల అభిమానం చూరగొన్న

ప్రముఖ రచయితల

# ఉత్తమ కథానికలు

సంకలనం:

'శివం'

*

# జల్సాఘర్

బెంగాలీ కథలు

అనువాదం:

పి. హరిప్రసాదరావు

వివరములకు:

కవితా పబ్లికేషన్స్

విజయవాడ - 2

ABHAGINI
'SIVAM'

Rs. 1-50

A KAVITA PUBLICATION
VIJAYAWADA-2